

శ్రీశైలానంతపూరుషవంశజులైన
పురిశై శ్రీరంగాచార్యుల వారిచే
ప్రణీతమైన

# శ్రీనివాసగద్యం

## "శ్రీచరణ పరిచరణ" వ్యాఖ్యానంతో



ప్రచురణ
ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి - 2013

# శ్రీనివాస గద్యం - "శ్రీచరణ పరిచరణ" వ్యాఖ్యానంతో

ప్రచురణ : ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్, తి.తి.దే., తిరుపతి

వెల : అమూల్యము.

ప్రథమ ముద్రణ : 2013

ప్రతులు : 3000

ప్రకాశకులు :

శ్రీ ఎం.జి. గోపాల్, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి - 517 507

ముద్రణ :
తి.తి.దే. ముద్రణాలయం
తిరుపతి-517 507



శ్రీనివాసగద్యం - శ్రీచరణ పరిచరణ వ్యాఖ్యానంతో

# నివేదన

భగవానుడు పరవ్యూహ విభవ అంతర్యామి అర్చారూపాలనే ఐదు ప్రకారాలను కల్గివుంటాడని శాస్త్రాలు తెలుపుతున్నాయి. పరం అంటే పరమపదంలోని రూపం. వ్యూహం పాలకడలిలో ఆదిశేషునిపై శయనించి ఉండే రూపం. ఇదే అవతారాలకు అన్నిటికీ మూలం. విభవం అంటే భగవానుడు ధర్మసంరక్షణార్థం స్వీకరించిన రామకృష్ణాది అవతారాలు. అంతర్యామి రూపం జీవుల హృదయకోశాలలో నిలచి, వారి స్థితిగతులకు కారణమై ఉండేరూపం. ఇక, ఈ నాల్గురూపాలకంటే చాలా సులభమైన, ఆరాధించదగిన రూపమే అర్చారూపం. పలు క్షేత్రాలలో, గృహాలలో, మందిరాలలో లోహ కాష్ఠాదిమయంగా వెలసి, భక్తులకు కొంగుబంగారంగా వెలిగే రూపమే ఇది. ఈ అర్చారూపాలన్నిటిలోను 'కలౌ వేంకట నాయకః' అనేరీతిలో ప్రపంచ ప్రసిద్ధి గాంచిన రూపం శ్రీవేంకటేశ్వరుడు.

శ్రీవేంకటేశ్వరుని వైభవాన్ని ఆ స్వామి వెలసిన తిరుమలను పలు పురాణాలు, కావ్యాలు, ఆళ్వారుల దివ్యప్రబంధాలు వివిధంగా కీర్తించాయి. గత శతాబ్దిలో తిరుపతిలో నివసించిన సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామి వారిచే రచింపబడిన సుమధురమైన శ్రీనివాసగద్యం శ్రీవేంకటేశ్వరుని దివ్యమంగళ రూపాన్ని, తిరుమల అందాన్ని హృద్యంగా స్తుతిస్తున్నది. తమ ఆచార్యులైన భగవద్రామానుజుల ఆజ్ఞానుసారం తిరుమలలో వేంకటేశ్వరునకు పుష్పకైంకర్యాన్ని చేసిన అనంతాచార్యులవారి వంశానికి చెందినవారు శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్య స్వామివారు. ఈ స్తుతి శబ్దమాధుర్యానికి, అర్థగాంభీర్యానికి నెలవు. అనంతాచార్యుల వారికి సంబంధించిన పలు ఐతిహ్యాల ప్రస్తావనకూడా ఈ గద్యలో కనిపిస్తుంది. ఈ గద్యం ప్రతిదినం సాయంకాలం తి.తి.దేవస్థానంవారి ఎస్.వి.బి.సి.ఛానల్‌లో ప్రసారం అవుతున్నది.

ఆళ్వార్‌దివ్యప్రబంధ ప్రాజెక్ట్, టి.టి.డి, ఆళ్వార్ల ప్రబంధాలను, ఆళ్వారుల

తర్వాత భక్తి సంప్రదాయాన్ని భారతావనిలో ప్రచారం చేసిన పలువురు శ్రీవైష్ణవాచార్యులు లోకానికందించిన సాహిత్యాన్ని విస్తృతమైన ప్రచారాన్ని చేయాలనే ఉద్దేశ్యంతో సులభ మైన వ్యావహారికభాషలో చిన్న చిన్న గ్రంథాలను ప్రచురించి, అందరికీ ఆ వాఙ్మయాన్ని అందించాలని ప్రయత్నిస్తున్నది. ఆ ప్రయత్నంలో భాగమే ఈ శ్రీనివాసగద్య వ్యాఖ్యాన గ్రంథప్రచురణ. ఈ గ్రంథాన్ని ముద్రించడానికి తగిన ప్రయత్నాన్ని చేసిన ప్రాజెక్ట్ స్పెషల్ ఆఫీసర్ శ్రీ డా॥ చొక్కలింగంగారు, వ్యాఖ్యాత శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు గారు అభినందనీయులు. భక్తులు, ఆస్తికులు, సాహిత్యరసికులు తాత్పర్యంతో కూడిన ఈ శ్రీనివాసగద్య వ్యాఖ్యానాన్ని ఆదరించి, శ్రీనివాసుని వైభవాన్ని సమగ్రంగా తెలుసుకొని, ఆనందిస్తారని నమ్ముతున్నాను.

శ్రీ ఎం. జి. గోపాల్, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు, తిరుపతి



# అవతారిక

శ్రీవేంకటేశకరుణాకలితాభిషేకం శ్రీమత్ ఫణీంద్రకులవారిధి పూర్ణచంద్రమ్ ।
శ్రీకృష్ణసూరిసుతశిష్య మనర్ఘశీలం శ్రీరంగసూరి మనఘం శరణం ప్రపద్యే ॥

ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో శ్రీవరవరమునులు "ఆశారియన్ శిచ్చన్ ఆరుయిరై ప్పేణుమవన్ తేశారుమ్ శిచ్చన్ అవన్ శీర్వడివై" (ఆచార్యుడు శిష్యుని అత్యంతం అమూల్యమైన ఆత్మను కాపాడాలి. తేజస్సు నిండుగా కల్గిన శిష్యుడు ఆ ఆచార్యుని దివ్యమంగళరూపాన్ని కాపాడాలి) అని అంటూ ఆచార్యుని దివ్యరూపాన్ని ఆరాధించడం శిష్యకర్తవ్యమని అన్నారు "సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా" (దేవుడైన శ్రీమన్నారాయణుడు సాక్షాత్తుగా మానవరూపాన్ని ధరించి, శాస్త్రపాణియై సంసారంలో మునిగినవారిని కరుణతో ఉద్ధరిస్తున్నాడు) అని, "పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు" (పీతాంబరధారి అయిన స్వామి పరమాచార్యుడై అవతరించి) అని, "సర్వేషాం ప్రథమాచార్యం శ్రీనివాసమహం భజే" (ఆచార్యపరంపరలో మొదటి ఆచార్యుడైన శ్రీనివాసుని భజిస్తున్నాను) అని, "స చాచార్యవంశో జ్ఞేయః, అసావసా విత్యాభగవత్తః" (ఆ ఆచార్యగురుపరంపరను భగవానునినుండి వీరు వీరు - అని క్రమంగా తెలియాలి) అని, "లక్ష్మీనాథ సమారంభామ్..... వందే గురుపరంపరామ్" (లక్ష్మీపతితో ఆరంభమవుతున్న.... గురు పరంపరను నమస్కరిస్తున్నాను) అని చెప్పబడినట్లుగా ప్రథమాచార్యుడు శ్రియఃపతి కనుక, ఆస్వామి దివ్యమంగళవిగ్రహధ్యానం కర్తవ్యమని ఏర్పడింది. ఈ దివ్యమంగళ విగ్రహారాధన కేవలం వైధమేకాక, రాగప్రాప్తంకూడా. భగవానుని దివ్యమంగళవిగ్రహానికి శుభాశ్రయమనిపేరు. భగవద్యామునులు కాంతా చతుః శ్లోకిలో "మూర్తం బ్రహ్మ తతో-పి తత్ప్రియతరంరూపం యదత్యద్భుతమ్" (భగవానుని గొప్పదైన దివ్యమంగళరూపం దివ్యాత్మస్వరూపం కంటే గొప్పది, భగవానునకు కూడా మిక్కిలి ఇష్టమైనది, ఆ స్వామికి కూడా ఆశ్చర్యాన్ని కల్గించేది) అని అంటూ భగవానునిరూపం యొక్క మాధుర్యాన్ని స్తుతించారు. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తత్త్వత్రయమనే రహస్యగ్రంథంలోని ఈశ్వరప్రకరణంలో

భగవానుని దివ్యమంగళవిగ్రహ వైభవాన్ని ప్రస్తావిస్తూ - "విగ్రహన్దాన్ స్వరూప రూపగుణజ్ఞఞ ఙ్కాట్టిల్ అత్యంతాభిమతమాయ్, స్వానురూపమాయ్" ఇత్యాదిగా పల్కిన చూర్ణిక, దానికి విశదవాక్ శిఖామణి శ్రీవరవర మునులు అనుగ్రహించిన రస్యమైన వ్యాఖ్యానం అనుసంధేయాలు. యోగిధ్యేయమైన భగవానుని దివ్యరూపాన్ని దర్శించిన నిత్యానపాయిని అయిన లక్ష్మీదేవి కూడా "అకలకిల్లేన్" (విడువలేను) అనే విశ్లేషభీతిని పొందుతుంది. ఇటువంటి శ్రీవేంకటేశుని దివ్యమంగళ విగ్రహవర్ణనమే ఈ శ్రీనివాసగద్యలోని ప్రధానప్రమేయం. కనుక భగవద్భక్తు లందరికి ఈ స్తుతి నిత్యానుసంధేయమై, పరమప్రాప్యమై, జీవాతువై వెల్గొందు తున్నది.

శ్రీనివాసగద్యం ప్రౌఢగంభీరమైనది. దీర్ఘదీర్ఘ సమాసాలతో, శ్రవణ పేయమైన, లయబద్ధమైన పదాల పోహళింపుతో సాగే ఈకృతి ఉత్కలికా ప్రాయమనే గద్యప్రబంధ ప్రక్రియలో అంతర్భవిస్తుంది. పెద్ద పెద్ద సమాసాలను, పరుషాక్షర ప్రాచుర్యాన్ని కల్గిన గద్యరచన ఉత్కలికాప్రాయమనబడుతున్నది. "భవేదుత్కలికాప్రాయం సమాసాఢ్యం దృఢాక్షరమ్" అని ఛందోమంజరిలో చెప్పబడిన ఉత్కలికాప్రాయలక్షణం పూర్తిగా ఇక్కడ సమన్వయిస్తుంది. ఈ కృతిలోని కావ్యగుణాలు, శబ్దార్థాలంకారాలు, ధ్వనివిశేషాలు సహృదయైక వేద్యాలు.

ఈ శ్రీనివాసగద్యను అనుగ్రహించినవారు మహామహోపాధ్యాయ చతుః శాస్త్రమహావిద్వాన్ ఉ॥ వే॥ మహావిద్వాన్ తిరుమలై అనన్దాణ్‌పిళ్ళై పురిశై శ్రీరంగాచార్యస్వామివారు. ఈ మహనీయులు అనన్దాళ్వాన్ అను పేరుతో ప్రసిద్ధులై, భగవద్రామానుజుల శిష్యులలో ముఖ్యులు, వారి ఆనతి చొప్పున తిరుమలలో నిత్యనివాస మేర్పరచుకొని, విశిష్టమైన పుష్పసమర్పణ కైంకర్యసేవను చేసిన పూర్వాచార్యులైన అనంతార్యుల వంశంలో జన్మించారు. వీరు 19వ శతాబ్ద ద్వితీయార్ధంలో, 20వ శతాబ్ది ప్రారంభంలో తిరుపతినగరాన్ని అలంకరించారు. ఆసేతుహిమాచలం వీరి కీర్తి చంద్రికలు వ్యాపించినవి. తిరుపతిలో నివసించిన ఈ శ్రీరంగాచార్య స్వామివారు, కాంచీపురంలో నివసించిన కున్దప్పాకమ్ శ్రీనివాసాచార్యస్వామివారు - అనే ఇరువురు పండిత లోకంలో సూర్య చంద్రులుగా ఆ కాలంలో ప్రసిద్ధిచెందారు.



ఈ ఆచార్యవర్యులు పరమపదించి ఇప్పటికి సుమారు 90 సంవత్సరములైనది. వీరు అగాధమైన పాండిత్యాన్నేకాక, నిష్కళంకమైన అనుష్ఠానసంపత్తిని కూడా కలవారు. చతుఃశాస్త్రాలలోనేకాక, పలు ఇతర శాస్త్రాలలో, సంగీతాది కళలలో చక్కని ప్రావీణ్యాన్ని కలవారు. తరువాతి కాలమున ప్రసిద్ధవిద్వాంసులై వెలిగిన ఉ॥వే॥ శ్రీమాన్ కపిస్థలం దేశికాచార్యస్వామివారు, శ్రీమత్పరమహంసేత్యాది ఇళైమేట్టఎ కియ శిఙ్గర్ మొదలైనవారు వీరి సన్నిధిలో చిరకాలం శాస్త్రాలను అధ్యయనం చేసారు. ఆంధ్రదేశంలోనే కాక, దక్షిణభారతంలో ప్రసిద్ధసంస్కృత విద్యాలయంగా పేరుగాంచిన తిరుపతిలోని ప్రాచ్యకళాశాల మొట్టమొదటగా ఈ ఆచార్యవర్యులచే ప్రారంభింపబడినదే. వారి కాలంలోనే అది అత్యుచ్ఛ దశను చేరుకొన్నది. దక్షిణభారతంలోనేకాక ఉత్తరభారతంలో కూడా వీరికి పలువురు శిష్యప్రశిష్యులు ఉన్నారు.

వీరు భగవద్ధర్మదర్పణము, ఉజ్జ్వలవేంకటనాథస్తోత్రము, లక్ష్మీగద్యము, శ్రీనివాసగద్యము, తిరుప్పావైసంస్కృతవివర్తము, అనంతార్యమహిమకథా సంగ్రహః, ఈశకేనకఠోపనిషద్భాష్యము, కుదృష్టిధ్వాంతమార్తాండము, కార్యాధికరణ వాదము, వేదమార్గమీమాంస, వాదిప్రశ్నసమాధి, సన్మార్గసందర్శనము, సన్మార్గ దీపము, జాతి వాదము, శ్రీవేంకటాద్రివిమతిధ్వాంతభాస్కరము, బ్రహ్మపదశక్తివాద వ్యాఖ్యానము, యద్రూపపత్రము, అవ్యాపక ప్రతిబంధకతా శూన్యత్వ క్రోడపత్రము, పంచలక్షణీ టిప్పణి, చతుర్దశలక్షణీ టిప్పణి, సామాన్యనిరుక్తి పత్రము, సువర్ణ వాదము, ప్రాతిపదికార్థ విచారము, నిర్ణయ సుధాముద్రము. బదరీ నారాయణ స్తోత్రము, ద్వారకాస్తోత్రము మొదలైన పలు గ్రంథాలను రచించారు.

తిరుపతిలో వీరి కాలంలో తిరుమల పెద్దజీయరు స్థానంలో ఒక మహాకవి ఉండేవారు. ఒక పర్యాయం వారు శరభవృత్తం అను ఒక నూతనమైన వృత్తంలో శ్లోకాన్ని వ్రాసి, ఈవిధంగా రచించడం ఎవ్వరికినీ సాధ్యం కాదు - అని అన్నారట. ఆ మాటను విని శ్రీరంగాచార్య స్వామివారు ఆ శరభవృత్తంలోనే "ఉజ్జ్వల వేంకటనాథస్తోత్రము" అను అద్భుతమైన స్తోత్రాన్ని శ్రీవేంకటేశ్వరుని

విషయంగా రచించారు. దీనని చూసి ఆ జీయరు స్వామి చాలా సంతోషించారట.

వీరి చరిత్రకు సంబంధించిన కొన్ని విశేషాలు శ్రీవైష్ణవపత్రికలో (క్రీ॥శ॥1946 సం॥లో) తెలుపబడ్డాయి. వీరు ఒక పర్యాయం సాలగ్రామ క్షేత్ర యాత్రను చేసే సమయంలో, నేపాల దేశంలో ఏనుగుపై ప్రయాణం చేయవలసి వచ్చింది. అప్పుడు ఒక అద్భుతం జరిగింది. శ్రీమాన్ స్వామివారు ప్రయాణం చేసే ఏనుగు ఎందు వల్లనో బెదిరి పరుగుతీయడం ప్రారంభించింది. మావటివాడుకూడా దానిని నిలుపలేక భయంతో కిందకు దూకి పారిపోయాడు. శ్రీ సుదర్శనోపాసకులైన శ్రీ స్వామివారుమాత్రం ఆ ఏనుగుపైనే కూర్చొని, సుదర్శనస్వామిని ధ్యానిస్తూ ఉండిపోయారు. కొంతసేపటికి ఆ ఏనుగు ఒక చెట్టు దగ్గర నిలచింది. అపుడు స్వామి మెల్లగా ఆ చెట్టుకొమ్మలను ఆధారంగా చేసుకొని కిందకి దిగారు. వారు చేసే సుదర్శనోపాసన మహిమవల్ల వారికి ఏవిధమైన ఆపద సంభవించలేదు. ఇటువంటి అద్భుత సంఘటనలు వీరి చరిత్రలో చాలా ఉన్నాయి.

శ్రీమాన్ శ్రీరంగాచార్య స్వామివారు ఉత్తరభారతదేశంలో శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని మిక్కిలిగా ప్రచారం చేశారు. జగద్గురు ప్రతివాది భయంకరమ్ అనంతాచార్యస్వామివారు వీరి మేనల్లుడే. వీరు కూడా ఉత్తర భారతదేశంలో విశేషమైన ప్రచారాన్ని చేశారు. “ఞానమనుట్టానమివై నన్గాకవే యుడైయనాన” అనే శ్రీవరవరమునుల సూక్తికి వీరు గొప్ప నిదర్శనం. వీరి వైరాగ్యం విలక్షణమైనది. ఎటువంటివారినైనా వశం చేసుకోగల్గిన వాక్చాతుర్యం, రూపం వీరి సొత్తు. వీరికి పుత్రసంతానం లేదు. దౌహిత్రులు శ్రీ ప్రతివాదిభయంకరమ్ అనంతాచార్య స్వామివారు వీరి సన్నిధిలోనే శాస్త్రాభ్యాసాన్ని చేసి, గొప్ప పండితులైన, ఉత్తర భారతంలో సంప్రదాయ ప్రచారాన్ని చేశారు.

ఈ సందర్భంలో గమనించదగిన ఒక ముఖ్య విషయం ఉన్నది. శ్రీనివాస గద్యం చివర (29వ చూర్ణికలో) “మడ్డు డిండిమ” ఇత్యాది చూర్ణికలో ఇటీవల



చాలా ప్రక్షేపాలు చోటు చేసుకున్నాయి. చాలా రాగాల, తాళాల ప్రస్తావన అందులో కన్పిస్తున్నది. ఈ భాగం శ్రీరంగాచార్యస్వామి కృతం కాదు. సుమారు నూఱు సంవత్సరాలకు ముందు, రచయిత జీవించియుండగానే బొంబాయిలో ముద్రింపబడిన కోశంలోగాని, సుమారు అరవై సంవత్సరాలకు ముందు, రచయిత సమకాలీనులు అయిన శ్రీమాన్ డి.టి.తాతాచార్యస్వామివారి సంపాదకత్వంలో తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం ముద్రించిన “శ్రీవేంకటేశ్వరకావ్య కలాపః” అనే సంకలనాత్మక గ్రంథంలో గాని ఈ భాగం లేదు. అందువల్ల ఇది నిస్సందేహంగా ప్రక్షిప్తమే. ఒక కవి రచించిన భాగాన్ని తొలగించడం గాని, లేక, రచించని భాగాన్ని ప్రక్షేపించడంగాని ఆకవిపట్ల చేసే అపచారమే కాగలదు. అందువల్ల ఆ ప్రక్షిప్తభాగం ప్రకృతంలో వ్యాఖ్యానింప బడలేదు. వ్యాఖ్యానంలోని గుణదోషాలకు సహృదయపాఠకులే ప్రమాణం.

ఇట్లు, నివేదించు
సహృదయ నియోజ్యుడు

ఈ.ఏ. శింగరాచార్యులు

చతుఃశాస్త్రమహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ అనన్దాణ్పిళ్ళై
పురిశై శ్రీరంగాచార్యస్వామి విద్వద్వరేణ్యులచే విరచితమైన

# శ్రీనివాసగద్యం

శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్।
అభంగురవిభూతి ర్నస్తరంగయతు మంగళమ్ ॥

1. శ్రీమదఖిలమహీమండలమండనధరణిధరమండలాఖండలస్య,

2. నిఖిలసురాసురవందితవరాహక్షేత్రవిభూషణస్య,

3. శేషాచలగరుడాచల వృషభాచలనారాయణాచలాంజనాచలాది శిఖరి మాలాకులస్య,

4. నాథముఖబోధనిధివీథిగుణసాభరణసత్త్వనిధితత్త్వనిధిభక్తిగుణపూర్ణ శ్రీశైల పూర్ణగుణవశంవద పరమపురుషకృపాపూరవిభ్రమదతుంగశృంగ గలద్గగన గంగాసమాలింగితస్య,

5. సీమాతిగగుణరామానుజమునినామాంకిత బహుభూమాశ్రయ సురధామా లయవనరామాయతవనసీమాపరివృతవిశంకటతటనిరంతర విజృంభిత భక్తిరసనిర్ఝరానంతార్యాహార్యప్రస్రవణ ధారాపూరవిభ్రమద సలిలభర భరితమహాతటాకమండితస్య,

6. కలికర్దమమలమర్దనకలితోద్యమవిలసద్యమనియమాదిమమునిగణ నిషేవ్య మాణ ప్రత్యక్షీభవన్నిజసలిల సమజ్జనమజ్జననిఖిల పాపనాశనపాపనాశన తీర్థాధ్యాసితస్య,

7. మురారిసేవక జరాధిపీడిత నిరార్తిజీవన నిరాశభూసుర వరాతిసుందర సురాంగనా రతికరాంగ సౌష్ఠవకుమారతాకృతి కుమారతారక సమాపనోదయ దమానపాతక మహాపదామయవిహాపనోదిత సకలభువనవిదిత కుమార ధారాభిధాన తీర్థాధిష్ఠితస్య,



8. ధరణితలగత సకలహత కలిలశుభ సలిలగత బహులవివిధ మలహతి చతుర రుచిరతరవిలోకమాత్రవిదళితవివిధమహాపాతక స్వామిపుష్కరిణీ సమేతస్య,

9. బహుసంకట నరకావట పతదుత్కట కలికంకట కలుషోద్భట జనపాతక వినిపాతక రుచినాటక కరహాటక కలశాహృత కమలారత శుభమజ్జన జలసజ్జన భరిత నిజదురిత హతినిరత జనసతత నిరర్గళపేపీయమాన సలిలసంభృత విశంకట కటాహతీర్థవిభూషితస్య,

10. ఏవమాదిమ భూరిమంజిమ సర్వపాతక గర్వహాపక సింధుడంబర హారిశంబర వివిధవిపుల పుణ్యతీర్థనివహనివాసస్య,

11. శ్రీమతో వేంకటాచలస్య

12. శిఖరశేఖరమహాకల్పశాఖీ,

13. ఖర్వీభవదతిగర్వీకృతగురుమేర్వీశగిరిముఖోర్వీధరకులదర్వీకర దయితోర్వీ ధరశిఖరోర్వీసతతసదుర్వీకృతిచణనవఘనగర్వచర్వణనిపుణ తనుకిరణ మసృణిత గిరిశిఖరశేఖర తరునికరతిమిరః,

14. వాణీపతి శర్వాణీదయితేంద్రాణీశ్వరముఖనాణీయోరసవేణీనిభ శుభవాణీ నుతమహిమాణీయస్తరకోణీ భవదఖిలభువన భవనోదరః।

15. వైమానికగురుభూమాధికగుణ రామానుజకృతధామాకరకరధామారిదర లలామాచ్ఛకనకదామాయిత నిజరామాలయనవకిసలయమయతోరణ మాలాయితవనమాలాధరః,

16. కాలాంబుదమాలానిభనీలాలకజాలావృతబాలాబ్జసలీలామలఫాలాంక సమూలామృతధారాద్వయావధీరణధీరలలితతరవిశదతర ఘనఘన సారమయోర్ధ్వపుండ్ర రేఖాద్వయరుచిరః,

17. సువికస్వర దళభాస్వర కమలోదర గతమేదుర నవకేసర తతిభాసుర పరిపింజర కలితాంబర కలితాదర లలితోదర తదాలంబజంభ

రిపుమణిస్తంభ గంభీరిమదంభస్తంభన సముజ్జృంభమాణ పీవరోరుయుగళ తదాలంబ పృథులకదళీ ముకుళ మదహరణ జంఘాలజంఘాయుగళః ,

18. నవ్యదళ భవ్యకల పీతమల శోణిమల సన్మృదుల సత్కిసలయాశ్రుజలకారి బలశోణతల పత్కమలనిజాశ్రయ బలబందీకృతశరదిందుమండలీ విభ్రమ దాద భ్రశుభ్ర పునర్భవాధిష్ఠితాంగుళీ గాఢనిపీడిత పద్మాసనః,

19. జానుతలావధిలంబివిడంబిత వారణశుండా దండవిజృంభిత నీలమణి మయ కల్పకశాఖా విభ్రమదాయి మృణాళలతాయిత సముజ్జ్వలతర కనక వలయ వేల్లితైకతర బాహుదండయుగళః,

20. యుగపదుదిత కోటిఖరకర హిమకర మండల జాజ్జ్వల్యమాన సుదర్శన పాంచజన్య సముత్తుంగిత శృంగాపరబాహుయుగళః,

21. అభినవశాణ సముత్తేజిత మహామహానీలఖండ మదఖండననిపుణ నవీన పరితప్త కార్తస్వరకవచిత మహనీయ పృథులసాలగ్రామ పరంపరాగుంఫిత నాభిమండలపర్యంత లంబమానప్రాలంబదీప్తి సమాలంబిత విశాలవక్షః స్థలః,

22. గంగాఝరతుంగాకృతిభంగావలిభంగావహసౌధావలిబాధావహ ధారానిభ హారావళిదూరాహత గేహాంతరమోహావహమహిమమసృణిత మహాతిమిరః,

23. పింగాకృతిభృంగారునిభాంగార దళాంగామల నిష్కాసిత దుష్కార్యఘ నిష్కావళి దీపప్రభ నీపచ్ఛవి తాపప్రద కనకమాలికా పిశంగితసర్వాంగః,

24. నవదళిత దళవలిత మృదులలిత కమలతతి మదవిహతి చతురతర పృథులతర సరసతర కనకసర మయరుచిర కంఠికా కమనీయకంఠః,

25. వాతాశనాధిపతిశయన కమనపరిచరణ రతిసమేతాఖిల ఫణధరతతి మతికర కనకమయనాగాభరణ పరివీతాఖిలాంగావగమిత శయనభూతాహిరాజ జాతాతిశయః,

26. రవికోటీ పరిపాటీ ధరకోటీర వరాటీకితవాటీరసధాటీ ధరమణిగణ కిరణ



విసరణ సతతవిధుత తిమిరమోహగర్భగేహః,

27. అపరిమిత వివిధభువనభరితాఖండ బ్రహ్మాండమండల పిచండిలః,

28. ఆర్యధుర్యానంతార్య పవిత్రఖనిత్రపాత పాత్రీకృత నిజచుబుకగ వ్రణకిణ విభూషణవహన సూచితశ్రిత జనవత్సలతాతిశయః,

29. మడ్డుడిండిమ డమరుఝర్ఝర కాహళీ పటహావళీ మృదుమర్దలాలి మృదంగ దుందుభి ఢక్కికాముఖ హృద్యవాద్యక మధు మంగళ నాదమేదుర విస్మృమర సరసగాన రసరుచిర సంతతసంతన్యమాన నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవాది వివిధోత్సవ కృతానందః,

30. శ్రీమదానందనిలయవిమానవాసః,

31. సతతపద్మాలయాపదపద్మరేణుసంచితవక్షఃస్థలపటవాసః,

32. శ్రీశ్రీనివాసః సుప్రసన్నో విజయతామ్

శ్రీరంగసూరిణేదం శ్రీశైలానంతసూరివంశ్యేన ॥
భక్త్యా రచితం హృద్యం గద్యం గృహ్ణాతు వేంకటేశానః ॥

ఆ

చతుఃశాస్త్రమహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ అనన్తాణ్పిళ్ళై
పురిశై శ్రీరంగాచార్యస్వామి విద్వద్వరేణ్యులచే విరచితమైన

# శ్రీనివాసగద్యం

## శ్రీచరణపరిచరణ వ్యాఖ్యానంతో

శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్।
అభంగురవిభూతి ర్నస్తరంగయతు మంగళమ్ ॥

లక్ష్మికి వల్లభుడు. నిత్యమైన విభూతిని కలవాడు, పరమపురుషుడు అయిన వేంకటేశ్వరుడు మనకు శుభపరంపరలను అనుగ్రహించుగాక!

1. శ్రీమదఖిలమహీమండలమండనధరణిధరమండలాఖండలస్య,

శ్రీమత్ = శోభను, సంపత్తును కల్గిన, అఖిల = సమస్తమైన, మహీ మండల= భూమండలమునకు, మండన = అలంకారమైనది, ధరణిధర మండల + అఖండలస్య = పర్వతసమూహములలో ఇంద్రునివంటిది. (గొప్పది).

ఈ మొదటి విశేషణమునుండి 11వ చూర్ణికలోని "శ్రీమతః" అనే పదం వరకు గల అన్ని విశేషణాలు "వేంకటాచలస్య" అనే విశేష్యంతో అన్వయిస్తాయి. శోభను కల్గిన, సమస్త భూమండలానికి అలంకారమైనది, పర్వతాలన్నిటిలో గొప్పది శ్రీవేంకటాచలం- అని తాత్పర్యం. మేరుపర్వతం, హిమవత్పర్వతంవంటి గొప్ప గొప్ప పర్వతాలు ఎన్ని ఉన్నా, వాటికంటే పరమాత్మ అయిన శ్రీవేంకటేశ్వరుడు తన నివాసంగా పరిగ్రహించిన అతిశయాన్ని కల్గి ఉన్నందువల్ల శ్రీవేంకటాచలం నిరతిశయశోభను పొందింది. పర్వతాలన్నింటిలో శ్రేష్ఠమైనదిగా పరిగణింప బడుతున్నది. "శ్రీమత్" అనే విశేషణాన్ని మహీమండలానికి అన్వయించి అర్థం చెప్పే వీలున్నది. "అఙ్గణ్ మాఞాలమ్" అని గోదాదేవి పల్కిన రీతిలో విభిన్నరుచులను కల విభిన్నవ్యక్తులకు తగిన రీతిలో పలు విధాలైన వస్తు సంచయాన్ని కల్గి ఉండడం, వైశాల్యాన్ని కల్గి ఉండడం - మొదలైన గొప్పతనాల వల్ల భూమికి శ్రీమత్త్వం కల్గిందని చెప్పవచ్చు. 11వ చూర్ణికలో



"శ్రీమత్" అనే విశేషణం వేంకటాచలానికి ప్రయోగింపబడినందున ఇక్కడ శ్రీమచ్ఛబ్దాన్ని మహీమండలానికి విశేషణంగా అన్వయించడమే సరసం.

2. నిఖిలసురాసురవందితవరాహక్షేత్రవిభూషణస్య,

నిఖిల = సకల, సుర+అసుర = దేవతలచే, రాక్షసలచే, వందిత = నమస్కరింపబడినది, వరాహక్షేత్ర = వరాహక్షేత్రమునకు, విభూషణస్య = గొప్ప అలంకారమైనది.

"ఎఙ్గుమ్ వానవర్ దానవర్ నిఱైన్దు ఏత్తుమ్ వేఙ్గడమ్" (అంతటా దేవతలు, దానవులు గుమిగూడి కీర్తించే వేంకటాచలం) అన్నట్లు సకల దేవతలచే, అసురులచే నమస్కరింపబడిన వరాహక్షేత్రానికి ఈ శ్రీవేంకటా చలం విశిష్టభూషణం. తిరుమల దివ్యక్షేత్రం ఆదివరాహక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. ఆదివరాహమూర్తి హిరణ్యాక్షుని సంహరించిన తరువాత భూదేవితో పాటు కొంతకాలం భూమిపై వేంచేసి ఉండాలని భావించి, ఈ పర్వతాన్ని తన నివాసంగా ఎన్నుకొన్న భాగ్యాన్ని తిరుమల క్షేత్రం కల్గి ఉన్నది. అందువల్లనే తిరుమల క్షేత్రానికి స్వామి వరాహస్వామియే. ఈనాటికీ తిరుమలలో ప్రతిదినం ప్రథమంగా ఆరాధన నివేదనాదులు ఈ వరాహస్వామికే చేయబడుతున్నాయి. పేయాళ్వార్లు తమ ప్రబంధంలో తిరుమలనుగూర్చి "మణ్ కోట్టు క్కోణ్డాన్ మలై" (దంతాగ్రంతో భూమిని ఉద్ధరించినవాని కొండ) అని అంటూ ఇది వరాహక్షేత్రమనే అంశాన్ని సూచించారు. వృషభాసురుడు తిరుమలను కీర్తిస్తూ "అయం వై గిరిరుచ్ఛ్రితశేఖరః" (ఈ కొండ ఎత్తైన శిఖరాలను కలిగినది) అని అంటూ పల్కడం "సురాసురవందిత" అనే ప్రయోగానికి అనుగుణంగా భావ్యం.

"నిఖిల సురాసురవందిత" అనే విశేషణాన్ని వరాహక్షేత్రానికి అన్వయించి అర్థం చెప్పవచ్చు. సమస్త దేవతలచే, అసురులచే వరాహక్షేత్రం కొలువబడింది అని తాత్పర్యం. అటువంటి క్షేత్రానికి వేంకటాచలం ఒక గొప్ప ఆభరణం.

3. శేషాచలగరుడాచల వృషభాచలనారాయణాచలాంజనాచలాది శిఖరి మాలాకులస్య,

శేషాచల = శేషాచలము, గరుడాచల = గరుడాచలము, వృషభాచల =

వృషభాచలము, నారాయణాచల = నారాయణాచలము, అంజనాచల = అంజనాచలము, అది = అను మొదలగు, శిఖరిమాలా = పర్వతపంక్తులతో, ఆకులస్య = నిండినది.

తిరుమల సప్తగిరుల కూటమిగా ప్రసిద్ధి చెందింది. ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ అను ఆచార్యులు శ్రీవేంకటేశసుప్రభాతస్తోత్రంలో "శ్రీశేషశైల గరుడాచల వేంకటాద్రి నారాయణాద్రివృషభాద్రి వృషాద్రిముఖ్యాః" అని అంటూ ఏడు పర్వతాల నామాలను అనుసంధించారు. ప్రకృతంలో శేషాచల, గరుడాచల, వృషభాచల, నారాయణాచల నామాలతో పాటు అంజనాచలనామం కూడా ప్రస్తుతమైనది. శ్రీబ్రహ్మాండ పురాణాంతర్గతమైన వేంకటాచలమాహాత్మ్యంలోని పంచమాధ్యాయంలో భగవానుని క్రీడాద్రికి అంజనాచలమనే పేరున్నది. అని తెలుపబడింది. ఈ క్రింది శ్లోకాలు ఆ విషయాన్ని తెల్పుతున్నవి. "అంజనే ! త్వం హి శేషాద్రౌ తపస్తప్త్వా సుదారుణమ్, పుత్రం సూతవతీ యస్మాత్ లోకత్రయ హితాయ వై, ప్రసిద్ధిం యాతు శైలో-యమంజనే! నామత స్తవ, అంజనాచల ఇత్యేవ నాత్ర కార్యా విచారణా'' (అంజనాదేవీ! నీవు శేషాచలంపై గొప్ప తపస్సును చేసి, ముల్లోకాల హితంకోసం కుమారుని కన్నావు కదా! అందువల్ల ఓ అంజనా! నీపేరుతో ఈ పర్వతం "అంజనాచల"మని పిలువబడు గాక. ఈ విషయంలో విచారణ చేయవలసిన పని లేదు) దీనివల్ల అంజనాదేవి ఈపర్వతంపై చిరకాలం తపస్సు చేసి హనుమానుని పుత్రునిగా పొందినందు వల్ల ఈ కొండకు అంజనాచలమనే పేరు కల్గినదని తెలుస్తున్నది.

ఆదిశేషుడే తిరుమలగా అవతరించినందువల్ల ఇది శేషాచల మనబడు తున్నది. బ్రహ్మాండపురాణం రెండవ అధ్యాయంలో -భగవానుడు ఆదిశేషునితో - "శ్రుతం హి భవతా సర్వం నారదోదీరితం వచః, క్రీడాసముచితే దేశే వస్తవ్యమితి మే మతిః, తత్ర భూత్వా గిరివరో భవాన్ వసతు భూతలే, త్వత్ఫణామండలభువి స్థాతవ్యం రమయా సహ'' (క్రీడించుటకు తగిన చోట నివసించాలని నా అభిప్రాయం. నారదుడు పల్కిన మాటను నీవు విన్నావు కదా! అతడు చెప్పిన చోట నీవు పర్వతరూపాన్ని ధరించి ఉండు. నీ పడగల కింది భాగంలో నేను లక్ష్మితో కలసి నివసిస్తాను) అని భగవానుడు ఆదిశేషునితో పల్కడం, ఆదిశేషుడు



కూడా ఆ విధంగానే పర్వతరూపాన్ని పొందడం గమనించవచ్చు.

గరుడాచలమనే పేరు ఈ పర్వతానికి కల్గడంలో హేతుభూతమైన వృత్తాంతం వరాహపురాణం ప్రథమభాగంలోని ద్వితీయాధ్యాయంలో తెలుప బడింది. శ్వేతవరాహస్వామి భూమిని సముద్రంనుండి ఉద్ధరించిన తరువాత కొంతకాలం భూమిపై నివసించాలని భావించి గరుడుని చూచి, "వైనతేయ! మహాసత్త్వ! గచ్ఛ త్వమతివేగతః, గత్వా తు పరమం ధామ క్రీడాచల మిహానయ'' (గొప్ప బలశాలివి అయిన వైనతేయా! నీవు వేగంగా పరమపదానికి పోయి, అక్కడనుండి క్రీడాపర్వతానికి ఇక్కడకు తీసికొని రా) అని ఆజ్ఞాపించగా, ఆ రీతిలోనే గరుడుడు పరమపదంనుండి క్రీడాద్రిని తీసికొని వచ్చాడని, అదే తిరుమల అని అక్కడ తెలుపబడింది.

నారాయణుడనే బ్రాహ్మణుడొకడు తిరుమలపై ఘోరమైన తపస్సును చేసి, భగవానుని ప్రత్యక్షం కావించుకొని, ఆ పర్వతం తన పేరుతో ప్రకాశించాలని వరాన్ని కోరి పొందినందువల్ల అది నారాయణాద్రి అనే పేరును పొందింది- అని బ్రహ్మాండపురాణంలోని 3వ అధ్యాయంలో తెలుపబడింది. "సేవ్యమానః శ్రియా సార్ధం విహరన్ వస మాధవ, గిరిశ్చాయం హి మన్నామ్నా ప్రసిద్ధి మధిగచ్ఛతు'' (మాధవా! లక్ష్మీదేవితోపాటు విహరిస్తూ నీవు ఈ కొండపై నివసించు. నా పేరుతో ఈ పర్వతం ప్రసిద్ధిని పొందాలి.) అనే నారాయణుని ప్రార్థన, "అద్య ప్రభృతి చైవాయం గిరిస్త్వన్నామతస్సదా, నారాయణాచల ఇతి ప్రసిద్ధో భవతు ద్విజ!'' (ఓ బ్రాహ్మణా! ఈనాటి నుండి ఈ కొండ ఈ పేరుతో నారాయణాచలం అని ప్రసిద్ధిని పొందుతుంది) అనే భగవానుని ప్రతివచనం స్మరణీయాలు.

తిరుమలలో శివభక్తుడైన వృషభుడనే పేరును కల అసురుడు సాధుజనాన్ని పీడిస్తూ ఉన్నపుడు భగవానుడు ఒకనాడు తటాలున అతని ముందు ప్రత్యక్షమయ్యాడు. ఆ అసురుడు అతనితో చిరకాలం పోరాడాడు. చివరకు భగవానుడు సుదర్శనాన్ని అతనిపై ప్రయోగించాడు. ఆ అసురుడు చనిపోయే ముందు తన పేరుతో ఈ పర్వతం పిలువబడాలని ప్రార్థించి వరంగా

పొందాడు. అందువల్ల ఈ గిరి వృషభాద్రి అని పిలువబడుతున్నది- అనే ఈ వృత్తాంతం బ్రహ్మాండపురాణంలోని నాల్గవ అధ్యాయంలో ఉన్నది. "త్రాతారం నైవ పశ్యామి త్వాం వినా మధుసూదన!, అద్య ప్రభృతి చాయం వై గిరిరుచ్ఛ్రితశేఖరః, మదాఖ్యయా ప్రథాం యాతు వృషభాచల ఇత్యపి'' (మధుసూదనా! నిన్ను తప్ప ఇంకొక రక్షకుని నేను చూడలేను. ఈనాటి నుండి గొప్ప శిఖరాలను కల ఈ కొండ నాపేరుతో వృషభాచలం అనే ప్రసిద్ధిని పొందాలి) అనే వృషభాసురుని ప్రార్థన, "వృషభాసుర! మద్భక్త్యా విముక్తిం యాస్యసి ధ్రువమ్, గిరిశ్చాయం భవన్నామ్నా ప్రసిద్ధి మధిగచ్ఛతు'' (వృషభాసురా! నాపట్లగల భక్తి కారణంగా నీవు తప్పక ముక్తిని పొందగలవు. ఈ కొండ కూడా ఈ పేరుతో ప్రసిద్ధిని పొందగలదు.) అనే భగవానుని అనుగ్రహవచనం స్మరణీయాలు.

సమాసం చివరలో గల 'ఆది' పదంచేత వేంకటాచల, శ్రీశైలాది నామాలను గ్రహించవచ్చు.

4. నాథముఖబోధనిధివీథిగుణసాభరణసత్త్వనిధితత్త్వనిధిభక్తిగుణపూర్ణ శ్రీశైలపూర్ణగుణవశంవద పరమపురుషకృపాపూరవిభ్రమదతుంగశృంగ గలద్గగనగంగాసమాలింగితస్య,

నాథముఖ = నాథముని మొదలగు, బోధనిధి = జ్ఞాననిధులగు ఆచార్యుల, వీథి = వరుసయందు, గుణసాభరణ = సద్గుణములనెడి ఆభరణములను కల్గినవాడు, సత్త్వనిధి = సత్త్వగుణమునకు నిధి, తత్త్వనిధి = తత్త్వజ్ఞానమునకు నిధి, భక్తిగుణపూర్ణ = భక్తితో గుణములతో పూర్ణుడు అగు, శ్రీశైలపూర్ణ = శ్రీశైలపూర్ణుడను ఆచార్యునియొక్క, గుణ = సద్గుణములకు, వశంవద = వశుడైన, పరమపురుష = పురుషోత్తముడగు వేంకటేశ్వరునియొక్క, కృపాపూర= దయాప్రవాహమేమో? అను, విభ్రమద = భ్రమను కల్గించునది, తుంగశృంగ= ఎత్తైన పర్వతశిఖరమునుండి, గలత్ = ప్రవహించునది అగు, గగనగంగా = ఆకాశగంగానదిచే, సమాలింగితస్య = కూడియున్నది.

శ్రీమన్నాథమునులు విశిష్టాద్వైతసంప్రదాయ ప్రచారకాచార్యపరంపరలో మొదటివారు. "నాథోపజ్ఞం ప్రవృత్తమ్'' అని శ్రీదేశికుల సూక్తి. మన పూర్వాచార్యు లందఱు బోధనిధులు. అంటే - జ్ఞాననిధులు. ఇక్కడ బోధశబ్దాన్ని ఉపదేశ



పరంగా కూడా గ్రహించడంద్వారా ("అధీతిబోధాచరణప్రచారణైః'' అన్నట్లు) తత్త్వోపదేశాలద్వారా గొప్ప నిధులవంటివారనే స్వారస్యం భావనీయం. "వీథి'' అంటే వరుస - పరంపర. అటువంటి ఆచార్యపరంపరలో శ్రీశైలపూర్ణులు (తిరుమలనంబి) గుణసాభరణులు. సద్గుణాలనే గొప్ప అలంకారంగా కలవారు. వారు సత్త్వగుణానికి నిధి. ఒక పర్యాయం శ్రీరామానుజులు తిరుమలకు వేంచేసినపుడు శ్రీశైలపూర్ణులు తామే స్వయంగా ఎదురేగి, శ్రీరామానుజులకు స్వాగతాన్ని పలికారట. అపుడు శ్రీరామానుజులు "అయ్యో! మీరు వచ్చారే! చిన్నవారిని ఎవరినైనా పంపి ఉండవచ్చును కదా!'' అని అనగా, శ్రీశైలపూర్ణులు. "ఇక్కడ నాకంటే చిన్నవారు ఎవరూ నాకు కన్పించలేదు'' అని అన్నారట. శ్రీశైలపూర్ణులు సాత్త్వికగుణాతిశయానికి ఇది ఒక తార్కాణం. అదే విధంగా వీరు తత్త్వనిధి. వీరి సన్నిధిలో శ్రీరామానుజులు ఒక సంవత్సరకాలం పాటు శ్రీరామాయణంలోని తత్త్వార్థాలను శ్రవణం చేశారనే ఐతిహ్యం దీనిని నిరూపిస్తున్నది. "శ్రీభాష్యకారోత్తమదేశికాయ'' అని కదా వీరి స్తుతిలోని సూక్తి. అంతేకాక, వీరు భక్తిగుణపూర్ణులు కూడా. భక్తిగుణం చేత పూర్ణత్వమంటే- "ఆచార్యశేషత్వ పారతంత్ర్యాలను కల్గి ఉండడమే కదా! తిరుమలనంబి తమ ఆచార్యులైన శ్రీయామునాచార్యులవారి ఆజ్ఞానుసారం తిరుమలలో శ్రీవేంకటేశ్వరునకు తీర్థకైంకర్యం మొదలైన సేవలను చేసిన వృత్తాంతాన్ని వీరి చరిత్రలో గమనించవచ్చు.

ఇటువంటి మహనీయులైన శ్రీశైలపూర్ణుల గుణాలకు వశుడైన పరమపురుషుడే శ్రీవేంకటేశ్వరుడు. ఆ స్వామి కృపాప్రవాహమా ఇది ! అనే విభ్రమాన్ని కల్గించే రీతిలో, ఎత్తైన శిఖరంనుండి జాలువారే ఆకాశగంగాతీర్థం గోచరిస్తున్నది. ఇటువంటి గొప్ప తీర్థాన్ని కల్గినది- శ్రీవేంకటాచలం.

తిరుమలనంబి సద్గుణాలకు శ్రీవేంకటేశ్వరుడు వశుడనే సూక్తికి అనుగుణంగా వేంకటాచలేతిహాసమాలాది సంప్రదాయ చరిత్రగ్రంథాలలో కన్పిస్తున్న ఈవృత్తాంతం స్మరణీయం.

శ్రీశైలపూర్ణులు తమ ఆచార్యుల ఆజ్ఞానుసారం పాపనాశన తీర్థనుండి ప్రతిదినం శ్రీవేంకటేశ్వరుని అభిషేకం కోసం తీర్థాన్ని తీసికొనివచ్చే కైంకర్యాన్ని భక్తితో నిర్వహించే విషయం లోకంలో అందటికి తెలియాలి- అని భావించిన భగవానుడైన శ్రీవేంకటేశ్వరుడు ఒకనాడు వ్యాధుని రూపాన్ని ధరించి, విల్లంబులు చేతిలో తీసికొని పాపనాశనతీర్థం నుండి జలాన్ని తీసికొనివస్తున్న శ్రీశైలపూర్ణులకు ఎదురుగా వచ్చి, "ఓ తాతా ! (తండ్రీ !) నాకు చాలా దాహంగా ఉన్నది. కొంచెం తీర్థం ఇవ్వండి'' అని అడిగాడు. అపుడు శ్రీశైలపూర్ణులు- "ఓయీ వ్యాధుడా! నేనీ తీర్థాన్ని శ్రీవేంకటేశ్వరుని ఆరాధనకోసం తీసికొని పోతున్నాను. ఈ దివ్యతీర్థం మానవుల కోసం ఉపయోగించదగినది కాదు'' అని తిరస్కరించి ముందుకు సాగారు. వ్యాధుని రూపంలోని భగవానుడు శ్రీశైలపూర్ణులను అనుసరిస్తూ, వింటిలో బాణాన్ని సంధించి, వదలి శ్రీశైలపూర్ణులు జలాన్ని తీసికొనివస్తున్న ఘటానికి నేర్పుగా రంధ్రాన్ని, చేసి ఆ రంధ్రంద్వారా కారే జలాన్ని అంతా తాగాడు. భగవద్గుణ గానానుభవ పరవశుడైన శ్రీశైలపూర్ణులు ఈ సంగతిని మొదట గమనించలేదు. కాని, క్రమంగా ఘటం తేలిక అవుతున్నందున గమనించి చూచి, కుండలో జలం అంతా వ్యాధుడు బాణాన్ని ప్రయోగించి చేసిన రంధ్రంద్వారా బయటకు స్రవించిందని తెలిసికొని చాలా కోపపడ్డారు. "ఓరీ ! మూఢుడా ! వ్యాధుడా ! భగవానుని ఆరాధనకోసమైన ఈ జలాన్ని నీవు ద్రోహం చేసి పానం చేశావు'' అని నిందించారు. వ్యాధుడు - "తాతా ! నీవు విచారించవద్దు. ఇక్కడే సమీపంలో ఉండే ఒక దివ్యతీర్థాన్ని చూపిస్తాను, రండి'' అని శ్రీశైలపూర్ణులను ఆకాశగంగా తీర్థం వద్దకు తీసికొనిపోయి, తన వింటినుండి వదలిన బాణంగా చేయబడ్డ గడ్డిపోచతో ఒక కొండకొమ్మును కొట్టి, ఆ కొండశిఖరంనుండి మిక్కిలి వేగంగా ఉబికివస్తున్న అతినిర్మలమైన ఆకాశగంగా ప్రవాహాన్ని చూపి, "తాతా! ఇది ఆకాశగంగా నది. భగవానునకు చాలా ప్రియమైనది. ఇప్పటినుండి ఈ తీర్థాన్నే ప్రతిదినం తీసికొని వెళ్ళండి'' అని పల్కి మాయమయ్యాడు. ఆరీతిలోనే శ్రీశైలపూర్ణులు ఆనాటినుండి ఆకాశగంగా తీర్థాన్నే శ్రీవేంకటేశ్వరుని అభిషేకార్థం తీసికొనిపోయారు.



ఇట్లు ఈ సమాసంలోని "సత్త్వనిధి, తత్త్వనిధి, భక్తిగుణపూర్ణ'' ఇత్యాది విశేషణాలు ఈ స్తుతిని రచించిన అనన్తాణ్పిళ్ళై పురిశై శ్రీరంగాచార్యస్వామి వారి వంశానికి మూలపురుషులైన శ్రీశైల అనంతార్యులవారిచే రచింపబడ్డ శ్రీవేంకటాచలేతిహాసమాలను ఆధారంగాచేసికొని ప్రయోగింపబడిన విషయం గమనార్హం.

5. సీమాతిగగుణరామానుజమునినామాంకిత బహుభూమాశ్రయ సురధామా లయవనరామాయతవనసీమాపరివృతవిశంకటతటనిరంతర విజృంభితభక్తిరస నిర్ఝరానంతార్యాహార్యప్రస్రవణ ధారాపూరవిభ్రమద సలిలభర భరితమహా తటాకమండితస్య,

సీమాతిగ = అవధిని దాటిన, గుణ = గుణములను కల, రామానుజ ముని= భగవద్రామానుజమునుల, నామ = పేరుతో, అంకిత = అంకితమైనది, బహుభూమా+ఆశ్రయ = గొప్ప మహిమకు ఆశ్రయమైనది, సురధామ + ఆలయ = దేవతల నివాసములకు నిలయమైన స్వర్గములోని, వన = నందనవనము కంటె, రామ = మనోహరమైన, ఆయత = విస్తృతమైన, వనసీమా = వనసీమచే, పరివృత = చుట్టబడినది, విశంకట = గొప్పదైన, తట = తీరమును కల్గినది, నిరంతర = ఎల్లప్పుడు, విజృంభిత = మిక్కిలి పెంపొందిన, భక్తిరస= భక్తి అను రసముయొక్క, నిర్ఝర = జలపాతమైనది, అనంతార్య + ఆహార్య= తీసికొని రాదగినది, ప్రస్రవణ = ప్రవాహముయొక్క, ధారాపూర = కొండవాగుల యొక్క, విభ్రమద = భ్రమను కల్గించు, సలిలభర= నీటి పౌష్కల్యముచే, భరిత= నిండిన, మహాతటాకమండితస్య = గొప్ప తటాకముతో భూషింపబడినది (అలంకరింపబడినది).

ఈ విశేషణంలో ప్రస్తుతింపబడ్డ వృత్తాంతంకూడా శ్రీవేంకటాచలేతిహాస మాలలో ఉన్నది.

శ్రీరామానుజులు అవధి లేని కల్యాణ గుణాలను కల్గినవారు. ఎల్లప్పుడు భగవత్స్వరూప రూపగుణవిభూతి లీలలనుగూర్చి మననం చేస్తున్నందువల్ల, లోకశ్రేయస్సునుగూర్చి మననం చేస్తున్నందువల్ల వారు మునిశబ్దవాచ్యులు. ఆ

మహనీయుల ఆజ్ఞానుసారం శ్రీశైల అనంతాచార్యులవారు తిరుమలకు చేరి శ్రీవేంకటేశ్వరునకు నిత్యం పుష్పమాలికా సమర్పణకైంకర్యం చేయడంకోసం ఒక పెద్ద చెఱువును స్వయంగా తవ్వి నిర్మించి, దానికి తమ ఆచార్యులైన శ్రీరామానుజుల పేరును పెట్టారు. ఆ తటాకం తీరప్రదేశాలలో పెంచబడ్డ ఉద్యానవనాలు చాలా అందమైనదిగా చెప్పబడే ఇంద్రుని నందనవనంలో ఉద్యానవనాలకంటే మిక్కిలి అందమైనది. ఆ తటాకం చుట్టూ గల తీరాలు చాలా గొప్పవి. ఇక, ఆ రామానుజతటాకంలో నిండుగా ఉండే జలాలను చూస్తే. చూస్తే నిరంతరం విజృంభించే భక్తిరసప్రవాహంవలె గోచరిస్తున్నది. అనంతాచార్యులవారిచేత ప్రవహింపజేయబడిన పర్వతంనుండి స్రవించే నీటి ఊటల ధారలా ఇవి! అనే విభ్రమాన్ని కల్గిస్తున్నది.

6. కలికర్దమమలమర్దనకలితోద్యమవిలసద్యమనియమాదిమమునిగణ నిషేవ్యమాణ ప్రత్యక్షీభవన్నిజసలిల సమజ్జనసమజ్జననిఖిల పాపనాశనపాపనాశన తీర్థాధ్యాసితస్య,

కలికర్దమ = కలిదోషమనెడి (పాపమును) మల = మలినమును, మర్దన= మర్దించుటకై (తొలగించుటకై), కలిత = చేయబడిన, ఉద్యమ = ప్రయత్నమును కల్గినవి, విలసత్ = ప్రకాశించు, యమనిమయ = యమము, నియమము, ఆదిమ = మొదలగువానిని కల్గినవి అగు, మునిగణ = ఋషిగణములచే, నిషేవ్యమాణ= సేవింపబడుచున్నది, ప్రత్యక్షీభవత్ = ప్రత్యక్షమగుచున్న (స్పష్టముగా ఆచరించు), నిజసలిల = తన జలమునందు, సమజ్జన = స్నాన పూర్వకముగా (స్నానము చేసిన తర్వాత) నమత్ = నమస్కరించు, జన = జనుల, నిఖిల = సమస్త, పాప = పాపములను, నాశన = నాశనమును కల్గినది, పాపనాశన = పాపనాశనమను, తీర్థ=తీర్థముచే, అధ్యాసితస్య = అధిష్ఠింపబడినది.

ఇందులో పాపనాశనమనుతీర్థ మహిమ ఉగ్గడింపబడుతున్నది. పాపనాశన తీర్థజలాలు పాపహరాలు. ఆ తీర్థాన్ని యమనియమాదులను కల్గిన గొప్ప మునిగణం సేవిస్తున్నది. ఆ తీర్థజలాలలో స్నానం చేసి, నమస్కరించేవారి సకలపాపాలు తీరిపోతాయి.

పాపనాశన తీర్థానికి ఆ పేరు కల్గడంలో కారణభూతమైన వృత్తాంతం



పాద్మపురాణాంతర్గతమైన వేంకటాచలమహాత్మ్యంలో "యత్ర తీర్థే సకృత్ కృత్వా మఘవా వృత్రహా పురా, బ్రహ్మహత్యావిముక్తః సన్ ప్రాప చైంద్రం పునః పదమ్, పాపనాశనవిఖ్యాతో నిర్ఝరో జర్ఝరైనసామ్'' (ఈ తీర్థంలో ఒక్కమారు స్నానం చేసిన ఇంద్రుడు వృత్రాసురుని చంపినందువల్ల తనకు కల్గిన బ్రహ్మహత్యా పాతకంనుండి విముక్తిని పొంది తిరిగి ఇంద్ర పదవిని పొందాడు. అందువల్ల దీనికి పాపనాశనం అనేపేరు వచ్చింది.) అని తెలుపబడింది. ఈ తీర్థతటంలో మునులు సేవిస్తూ ఉండే విషయాన్ని స్కాందపురాణంలోని 8వ అధ్యాయంలోని సుమతివృత్తాంతం, 9వ అధ్యాయం లోని భద్రమతి వృత్తాంతం తెల్పుతున్నవి. "సర్వతీర్థోత్తమం పుణ్యం నామ్నా పాపవినాశనమ్, అస్తి పుణ్యతమే విప్రాః! పవిత్రే వేంకటాచలే, యస్య సంస్మరణాదేవ గర్భవాసో న విద్యతే'' (ఓ విప్రులారా! అన్ని తీర్థాలాలో గొప్పది, పవిత్రమైనది, పాపనాశనం అనే పేరు కల్గినది అయిన ఒక తీర్థం వేంకటాద్రిలో ఉన్నది. దీనిని స్మరిస్తే తిరిగి గర్భవాసం కలుగదు.) అని, ''మహాతీర్థం నామ్నా పాపవినాశనమ్, అస్తి పుణ్యం ప్రసిద్ధం చ మహాపాతకనాశనమ్, భూతప్రేత పిశాచానాం బేతాలబ్రహ్మరక్షసామ్, మహతాం చైవ రోగాణాం తీర్థం తన్నాశకం స్మృతమ్'' (పాపవినాశనం అనే గొప్ప తీర్థం ఉన్నది. అది పుణ్యమైనది. ప్రసిద్ధమైనది. మహాపాతకాలను కూడా నశింపజేసేది, భూతప్రేతపిశాచాల వల్ల, బేతాల బ్రహ్మరక్షస్సులవల్ల భయంలేకుండా చేసేది, గొప్ప రోగాలను కూడా తీర్చేది) అని, ''ఏవం ప్రభావమేతద్ధ్వై తీర్థం పాపవినాశనమ్, పాపానాం నాశనాత్ విప్రాః! పాపనాశాభిధం హి తత్'' (ఇటువంటి ప్రభావాన్ని కలిగినది ఈ పాపవినాశతీర్థం. ఓ బ్రాహ్మణులారా! అందువల్లనే దీనికి ఈ పేరు వచ్చింది) ఇత్యాదిగా వర్ణింపబడ్డ పాపనాశన వైభవం స్మరణీయం.

7. మురారిసేవక జరాధిపీడిత నిరార్తిజీవన నిరాశభూసుర వరాతిసుందర సురాంగనా రతికరాంగ సౌష్ఠవకుమారతాకృతి కుమారతారక సమాపనోదయ దమానపాతక మహాపదామయవిహాపనోదిత సకలభువనవిదిత కుమార ధారాభిధాన తీర్థాధిష్ఠితస్య,

మురారిసేవక = భగవానుని సేవకుడై, జరా =ముసలితనము అను, అధి=

వ్యాధులచే, పీడిత = పీడితుడై, నిరార్తి = మిక్కిలి ఆర్తిచే, జీవననిరాశ = జీవితమందు నిరాశను కల, భూసురవర = బ్రాహ్మణశ్రేష్ఠునకు, అతిసుందర= మిక్కిలి అందమైన, సురాంగనా = అప్సరసలకు కూడ, రతికర = మోహమును కల్గించు, అంగసౌష్ఠవ = అందమైన అంగములను కల, కుమారతాకృతి = యౌవన రూపము కల్గించుటచేత, కుమార = కుమారస్వామికి, తారకసమాపన= తారకాసురుని వధించుటచే, ఉదయత్ =పుట్టుచున్న, అమానపాతక = అంతు లేని పాతకమువల్ల కల్గిన మహాపదామయ = గొప్ప ఆపద అను (మానసిక) వ్యాధిని, విహాపన = పోగొట్టుట చేత, ఉదిత = జనించిన, సకల భువన విదిత= అన్నిలోకాలలో ఖ్యాతి చెందిన, కుమారధారా = కుమారధార అను, అభిధాన = పేరును కల, తీర్థ = పుణ్యతీర్థముచే, అధిష్ఠితస్య= అధిష్ఠింపబడినది.

ఇందులో కుమారధారాతీర్థ మహిమ ప్రస్తుతం. దీనికి ఈ పేరు కల్గడానికి కారణమైన రెండు వృత్తాంతాలు ఇందులో ప్రస్తుతింపబడ్డాయి. ఈ రెండు మార్కండేయ పురాణాంతర్గతమైన శ్రీవేంకటాచలమాహాత్మ్యంలో తెలుప బడ్డాయి. అందులో మొదటి వృత్తాంతం ఈవిధంగా ఉన్నది.

ఒకానొక దరిద్రుడైన వృద్ధవిప్రుడు వార్ధక్యభారంచేత, బీదరికంవల్ల తన కుటుంబాన్ని పోషించలేక నిరాశను చెంది, తిరుమల కొండపైనుండి దూకి (భృగుపతనంద్వారా) ప్రాణాలను విడచివేయాలని నిశ్చయించుకొన్నాడు. వేంకటాద్రి శిఖరంపైకి ఎక్కి ఉచ్ఛైఃస్వరంతో ఆక్రందిస్తూ, "ఓ బ్రహ్మవిష్ణు మహేశ్వరులారా! చంద్రసూర్యులారా ! అశ్వినీదేవతలారా ! వినండి. దారిద్ర్యం వల్ల, వృద్ధాప్యం వల్ల నా జీవితం వ్యర్థమైపోయింది. నేనిక ఈ కొండపై నుండి దూకి ప్రాణాలను విడుస్తాను" అని అన్నాడు. మృగయారసికుడైన వేంకటేశ్వరుడు ఆ సమయానికి ఆ ప్రాంతానికి వచ్చి, ఆ విప్రుని మాటలను విన్నాడు. వెంటనే అతని ప్రయత్నాన్ని అడ్డుకొని అతనిని సమాధానపఱచి ఆత్మహత్యా ప్రయత్నాన్ని మానుమని అన్నాడు. అపుడా బ్రాహ్మణుడు తనకు మహైశ్వర్యాన్ని ప్రసాదించి రక్షించమని స్వామిని ప్రార్థించాడు. భగవానుడు అతనిని కుమారధారాతీర్థంవద్దకు తీసికొనిపోయి అందులో స్నానం చేయమని అన్నాడు. ఆ వృద్ధుడు కుమారధారాతీర్థంలో స్నానం చేయగానే అతనికి చక్కని



యౌవనంతో కూడిన రూపం కల్గింది. మనస్సు ప్రశాంతమైనది. విప్రుడు ఆశ్చర్యంతో తనకు ఆ ఉపకృతిని చేసినవారెవరా ? అని పరికించి చూడగా అప్పటికే భగవానుడు అదృశ్యుడై, ఆ విప్రునితో అతనికి ఆ ఐశ్వర్యాన్ని ఇచ్చినది తానేనని తెలిపాడు. ఈ సంగతిని అంతా గమనించిన దేవతలు కుమారధార తీర్థప్రభావానికి ఆశ్చర్యపడి, "అస్య తీర్థస్య మహిమా హ్యహో! వాచామగోచరః, కుమారత్వం ధనిత్వం చ సద్య ఏవ ద్విజే-భవత్, యతః కుమారతాం యాతః సద్యో వృద్ధమహీసురః, తస్మాత్ కుమారధారేతి లోకే ఖ్యాతిం గమిష్యతి" (ఆహా! ఈ తీర్థం యొక్క మహిమ వాచామగోచరం. దీని ప్రభావంవల్ల ఈ బ్రాహ్మణునకు శీఘ్రంగా యౌవనం, సంపద లభించాయి. ముసలివాడయిన ఈ బ్రాహ్మణుకు యౌవనం కలిగినందువల్ల ఈ తీర్థానికి కుమారధార అనే పేరు లోకంలో ప్రసిద్ధిని పొందగలదు.) అని పల్కి అక్కడనుండి వెళ్ళిపోయారు.

ఇక, రెండవ వృత్తాంతం కుమారస్వామికి సంబంధించినది. తారకాసుర సంహారంవల్ల కుమారస్వామికి కల్గిన బ్రహ్మహత్యాదోషం తీరడంకోసం అతనిని పరమేశ్వరుడు వేంకటాద్రిపై ఉండే కుమారధారతీర్థాలలో స్నానం చేసి శ్రీమన్నారాయణుని ఉద్దేశించి తపస్సు చేసి, ఆ పాపాన్ని పోగొట్టుకొనమని అన్నాడు. ఆ మాటను అనుసరించి కుమారస్వామి ఆ విధంగానే చేయగా, భగవానుడు ప్రత్యక్షమై అతనికి కల్గిన పాపాన్ని తీర్చాడు, దేవతలను, కుమారస్వామిని ఉద్దేశించి భగవానుడు - "శ్రుణ్వంతు దేవతాః! సర్వాః శ్రుణు స్కంద! వచో మమ, కుమారధారికేత్యేవ త్వన్నామ్నేదం భవిష్యతి, తత్ర స్నాతి పుమాన్ స్త్రీ వా-వశ్యం కో-పి తు మానవః, తస్య పాపాని నశ్యంతి సత్యం సత్యం వదామ్యహమ్" (ఓ దేవతలారా! మీరందరూ వినండి. ఓ కుమారస్వామి నీవు కూడా నామాటను విను. నీ పేరుతో ఈ తీర్థం కుమారధారా అని పిలువబడుతుంది. దీనిలో స్నానం చేసినవారికి తప్పక పాపాలు నశిస్తాయి. నేను నిజాన్ని చెబుతున్నాను.) అని అన్నాడు. ఈ వృత్తాంతాన్నిబట్టి కుమారస్వామికి కల్గిన బ్రహ్మహత్యాపాతకాన్ని తీర్చినందువల్ల కూడా ఈ తీర్థానికి కుమారధారా అనే పేరు ఏర్పడినదని తెలుస్తున్నది.

8. ధరణితలగత సకలహత కలిలశుభ సలిలగత బహులవివిధ మలహతి

చతుర రుచిరతరవిలోకమాత్రవిదళితవివిధమహాపాతక స్వామిపుష్కరిణీ సమేతస్య,

ధరణితలగత = భూతలమందున్న, సకల = సమస్తములైన, హతకలిల= పవిత్రమైన, శుభసలిలగత = (దోషము లేని) పుణ్యజలములయందున్న, బహువివిధ = అనేకములైన, వివిధములైన, మల = పాతకములయొక్క, హతి= నాశనమందు, చతుర = చాతుర్యమును కల్గినది, రుచిరతర = మిక్కిలి ప్రకాశవంతమైనది, (తీయనైనది) విలోకనమాత్ర = చూచుటతోనే, విదళిత = బ్రద్దలు చేయబడిన, వివిధ = అనేకములైన, మహాపాతక = మహాపాతకములను కల్గినదగు, (దర్శన మాత్రంతోనే పాపాలను తీర్చేది) స్వామిపుష్కరిణీ = స్వామి పుష్కరిణీ తీర్థముచే, సమేతస్య = కూడుకొన్నది.

ఇందులో స్వామిపుష్కరిణీమాహాత్మ్యం వర్ణింపబడుతున్నది. ముల్లోకాలలో ఉండే వారి పాతకాలను పోగొట్టి, శుభాలను కల్గించే తీర్థాలన్నిటిలోను పాపిష్ఠి జనులు స్నానం చేసినందువల్ల వాటిలో ఆ జనుల పాతకాలు సంక్రమిస్తాయి. ఆ విధంగా ఏర్పడిన మాలిన్యాన్ని తొలగించుకోవడంకోసం ఆ తీర్థాలు మార్గశిర మాసంలో శుద్ధద్వాదశినాడు అరుణోదయవేళలో స్వామిపుష్కరిణిలో కలుస్తాయి. తమ మాలిన్యాన్ని తీర్చుకొని పవిత్రతను పొందుతాయి - అనే ఈ అంశం వామన పురాణాంతర్గతమైన శ్రీవేంకటాచలమహాత్మ్యంలో (44వ అధ్యాయం) తెలుపబడింది. "తస్య శృంగే సుమహతీ పుణ్యా పాపవినాశినీ, స్వామిపుష్కరిణీ నామ సరసీ సర్వకామదా, త్రైలోక్యవర్తినాం బ్రహ్మన్! తీర్థానాం స్వామినీ హి సా, మాసే తు మార్గశీర్షాఖ్యే ద్వాదశ్యాం పూర్వపక్షకే, అరుణోదయ వేళాయాం త్రిషు లోకేషు విశ్రుతాః, తిస్రః కోట్యో-ర్ధకోటీ చ తీర్థానాం సుమహామతే!, సాన్నిధ్యం తత్ర కుర్వంతి స్వామిపుష్కరిణీజలే, పాపం స్వేషు వినిర్ముక్తం లోకైక రఘుసమన్వితైః, నిర్హరంతీహ తీర్థాని తస్యా తీర్థసమన్వయాత్" (వేంకటాచల శిఖరంపై చాలా గొప్పది, పవిత్రమైనది, పాపాలను నశింపజేసేది అయిన స్వామి పుష్కరిణి అనే సరస్సు ఉన్నది. ఓ బ్రహ్మా! ఈ తీర్థం ముల్లోకాలలోని అందరికీ అన్ని కోరికలను తీరుస్తుంది. ఇది తీర్థాలన్నింటికీ స్వామిని. మార్గశీర్షమాసంలో శుక్లపక్ష ద్వాదశి నాడు అరుణోదయ సమయంలో



ముల్లోకాలలోని ప్రసిద్ధాలైన మూడు కోట్ల తీర్థాలు ఈ స్వామి పుష్కరిణి తీర్థంలోకి వచ్చి చేరుతాయి. పాపాత్ములు తమలో స్నానం చేసినందువల్ల కల్గిన దోషాలను పోగొట్టు కొంటాయి.) అనే శ్లోకాలలో ఈ విషయాన్ని గమనించవచ్చు.

దర్శనమాత్రంతో స్వామిపుష్కరిణి పాపాలను హరిస్తుంది- అనే విషయాన్ని వరాహపురాణం తెల్పుతున్నది. స్వామిపుష్కరిణి వైకుంఠంనుండి భూమికి తీసికొనిరాబడిన భగవానుని క్రీడావాపి (బావి)యేననికూడా తెలుపబడింది. శ్రీసూతుడు మునులకు స్వామి పుష్కరిణీ మాహాత్మ్యాన్ని తెలియజేస్తూ ఈ విధంగా అన్నాడు. "మునయః! శ్రూయతాం కించిదుత్తరం సావధానతః, స్వామి పుష్కరిణీ పుణ్యా సర్వపాపప్రణాశినీ, వైకుంఠాత్ భగవత్క్రీడా వాపీ శ్రీభూమి లాలితా, అప్రాకృతజలౌఘా చ సుగంధా సుమనోహరా, గంగాది సర్వతీర్థానాం జన్మభూమిః శుభోదకాః,... దర్శనాత్ స్పర్శనాత్ పానాత్ స్మరణాత్ సర్వసిద్ధిదా.... తతస్తస్యాస్తు మాహాత్మ్యం వక్తుం దేవో-పి న ప్రభుః'' (ఓ మునులారా! నేను పలికే సమాధానాన్ని సావధానంగా వినండి. స్వామిపుష్కరిణి పవిత్రమైనది, అన్ని పాపాలను నశింపజేసేది. వైకుంఠంలో శ్రీదేవి భూదేవులచే లాలింపబడినది, దివ్యాలైన జలాలను కలిగినది, సుగంధాన్ని కల్గినది, మనోహరమైనది, గంగా మొదలైన సకల తీర్థాలకు జన్మభూమి, మంగళాన్ని కలిగించే జలాలను కల్గినది అయిన భగవానుని క్రీడావాపియే ఈ స్వామిపుష్కరిణి.... ఈ తీర్థాన్ని దర్శించడం వల్ల, తాకడం వల్ల, పానం చేయడంవల్ల, స్మరించడం వల్ల సమస్త సిద్ధులు కలుగుతాయి. అందువల్ల దీని గొప్పతనాన్ని చెప్పడానికి దేవునకు కూడా సాధ్యం కాదు ).

''త్రైలోక్యవర్తినాం బ్రహ్మన్! తీర్థానాం స్వామినీ హి సా, స్వామిపుష్కరిణీత్యేతత్ నామధేయం చ తత్కృతమ్'' (వామనపురాణం-44) (ఓ బ్రహ్మా! ముల్లోకాలలో ఉండే తీర్థాలన్నిటికి ఇది స్వామిని. అందువల్ల దీనికి స్వామి పుష్కరిణి అనే పేరు పెట్టబడింది) అనే సూక్తివల్ల కర్మధారయ సమాసం ద్వారా స్వామి పుష్కరిణీ శబ్దానికి తీర్థాలన్నిటికి స్వామిని - అనే అర్థాన్ని చెప్పవచ్చు. లేక, స్వామియొక్క పుష్కరిణి (స్వామినః పుష్కరిణి) అనే షష్ఠీతత్పురుష

సమాసాన్ని గ్రహించి, జగత్తునకు అంతటికి స్వామి అయిన శ్రీమన్నారాయణునియొక్క సరోవరం కనుక "స్వామి పుష్కరిణి" అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఈ పదమే తెలుగుభాషలో "కోనేరు"గా వ్యవహరింప బడుతున్నది. చిత్రమే మనగా - ఈ కోనేరు పదం స్వామి పుష్కరిణికే రూఢం. మిగిలిన వానికి యోగరూఢం. ఎందుకు? అంటే, తిరుమల కొండపై గల పుష్కరిణికే కదా "స్వామి పుష్కరిణి" అనే ప్రసిద్ధి ఉన్నది. ఈ స్వామి పుష్కరిణి పరమపదంలోని ఐరం మద తటాకమే. "ఐరం మదతటాకశ్చ వైకుంఠే యస్తు తిష్ఠతి, స ఏవ గీయతే చాత్ర స్వామిపుష్కరిణీతి చ" (వరాహ-50) (వైకుంఠంలోని ఐదంమదమనే తటాకమే ఇక్కడ గల స్వామి పుష్కరిణి) అనే సూక్తి ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నది. స్వామిపుష్కరిణి అన్ని తీర్థాలకు స్వామిని అనే వరాన్ని భగవానుడే దీనికి ఇచ్చాడని "స్నానార్థమాగతం తీర్థజాలం ప్రేష్య త్వమాప్నుయాత్, తీర్థాధిరాజ్యే తత్తీర్థజాలం త్వామభిషేక్ష్యతి" అనే బ్రహ్మాండ పురాణ (2వ అధ్యాయం) సూక్తి తెల్పుతున్నది.

9. బహుసంకట నరకావట పతదుత్కట కలికంకట కలుషోద్భట జనపాతక వినిపాతక రుచినాటక కరహాటక కలశాహృత కమలారత శుభమజ్జన జలసజ్జన భరిత నిజదురిత హతినిరత జనసతత నిరర్గళపేపీయమాన సలిలసంభృత విశంకట కటాహతీర్థవిభూషితస్య,

బహుసంకట = పలు సంకటాలతో కూడుకొన్న, నరక అవట = నరక కూపాలలో, పతత్ = పడుతున్నవారు, ఉత్కట కలికంకట = పూర్ణమైన కవచాలుగా కలవారు, కలుష ఉద్భట = దోషాలలో గొప్పవారైన, జన = పాపాత్ముల, పాతక= తీవ్రపాపాలను , వినిపాతక రుచినాటకకర = నశింపజేసే గొప్పలీలను చేసేది (అవలీలగా నశింపజేసేది), హాటక కలశాహృత = బంగారు కలశాలతో తీసికొనిరాబడినవి, కమలారతశుభమజ్జన = శ్రీవేంకటేశ్వరుని మంగళ స్నానం కోసమైనజలములను కల, సజ్జనభరిత = సజ్జనులతో నిండినది, నిజదురితహతి= తమ పాపాలను పోగొట్టుకోవడంలో, నిరత = ఆసక్తులైన, జన = జనులచేత, సతత = ఎల్లప్పుడు, నిరర్గళపేపీయమాన = అడ్డులేకుండా మిక్కిలిగా పానం చేయబడే, సలిలసంభృత = నీటితో నిండినది, విశంకట =



గొప్పది అయిన, కటాహతీర్థ = కటాహతీర్థంతో, విభూషితస్య = గొప్పగా భూషింపబడినది.

ఈ విశేషణంలో కటాహతీర్థమాహాత్మ్యం ప్రస్తుతింపబడింది. స్కాంద పురాణాంతర్గతమైన శ్రీవేంకటాచలమాహాత్మ్యంలో కటాహతీర్థమహిమ యొక్క ప్రశంస కన్పిస్తున్నది. సూతుడు ఈ తీర్థమహిమను ఋషులకు తెలియజేస్తూ ఈవిధంగా అన్నాడు. "కటాహతీర్థమాహాత్మ్యం కో వేత్తి భువనత్రయే,..... యాని కాని చ పుణ్యాని బ్రహ్మాండాంతర్గతానివై, తాని గంగాదితీర్థాని స్వపాపపరి శుద్ధయే, కటాహతీర్థసేవాం చ కుర్వంతి ద్విజసత్తమాః.... యాని నిష్కృతిహీనాని పాపాని వివిధాని చ, తాని సర్వాణి నశ్యంతి తీర్థస్యాస్య నిషేవణాత్" (ఓ బ్రాహ్మణోత్తము లారా! కటాహ తీర్థమహిమను ఈ ముల్లోకాలలో ఎవడు తెలియగలడు.... ఈ బ్రహ్మాండంలో పుణ్యతీర్థాలు ఏవేవి ఉన్నాయో ఆ గంగాది తీర్థాలన్నీ తమ పాపాలను పోగొట్టుకోవడం కోసం కటాహ తీర్థాన్ని సేవిస్తాయి. నిష్కృతి లేని పలువిధాలైన పాపాలు అన్నీ ఈ తీర్థాన్ని సేవించడంవల్ల నశిస్తాయి.) ఇదేవిధంగా ఈ తీర్థజల పానక్రమం కూడా ఈ సందర్భంలోనే తెలుపబడింది. "స్మృతిమాత్రేణ యత్పుంసాం సర్వపాపనిషూదనమ్, మంత్రేణాష్టాక్షరేణ వై, పిబేత్కటాహతీర్థం తత్ భుక్తిముక్తి ప్రదాయకమ్" (ఈ కటాహ తీర్థాన్ని స్మరించిన మాత్రంలోనే అన్ని పాపాలు నశిస్తాయి. అష్టాక్షరి మంత్రంతో ఈ తీర్థ జలాలను సేవిస్తే భుక్తి, ముక్తి కలుగుతుంది.) అష్టాక్షరి మంత్రాన్నిగాని, కేశవాదిద్వాదశ నామాలనుగాని, అచ్యుతానంత గోవిందనామ త్రయాన్నిగాని, "ఓం నమో వేంకటేశాయ" - అనే వేంకటేశాష్టాక్షరినిగాని అనుసంధించి ఈ జలాలను పానం చేయాలని దీనివల్ల తెలుస్తున్నది. ఈ సందర్భంలోనే కేశవుడనే బ్రాహ్మణునకు కల్గిన బ్రహ్మహత్యా పాతకం,ఈ తీర్థమహిమవల్ల తీరిందని కూడా తెలుపబడింది. "స్వామిపుష్కరిణీ స్నానం వరాహశ్రీశదర్శనమ్, కటాహతీర్థపానం చ త్రయం త్రైలోక్య దుర్లభమ్" (స్వామి పుష్కరిణిలో స్నానం, వరాహస్వామి దర్శనం, కటాహ తీర్థపానం - ఈ మూడు ముల్లోకాలలో దుర్లభాలు) అనే స్కాంద పురాణసూక్తి స్మరణీయం. "అవట" మంటే గోయి.

10. ఏవమాదిమ భూరిమంజిమ సర్వపాతక గర్వహాపక సింధుడంబర హారిశంబర వివిధవిపుల పుణ్యతీర్థనివహనివాసస్య,

ఏవమ్ ఆదిమ = ఇటువంటివి, భూరిమంజిమ = మిక్కిలి అందమైనవి, సర్వపాతక = అన్ని పాపములయొక్క, గర్వ =గర్వమును, హాపక = పోగొట్టునవి, సింధుడంబరహారి = సముద్రముయొక్క గర్వమును హరించు, శంబర = నీటిని కల్గినవి అగు, వివిధ = అనేకములైన, విపుల = విస్తృతములైన, పుణ్యతీర్థ= పుణ్యతీర్థముల యొక్క, నివహ = సమూహమునకు, నివాసస్య = నివాసమైనది అగు.

వేంకటాద్రిపై గల పుణ్యతీర్థాలు అనేకం అని, వాటి మాహాత్మ్యం వర్ణించడానికి సాధ్యం కాదని కామదేవుడు జనకునితో అంటూ -"శ్రూయతాం నృపతే! వక్ష్యే యత్ పృష్టో-హ మిహ త్వయా, తీర్థానాం నామధేయాని మాహాత్మ్యం చ తథా-ద్భుతమ్, విస్తరాత్ నైతదాఖ్యాతుం శక్యం వర్షశతైరపి'' (ఓ రాజా! నీ ప్రశ్నకు నేను సమాధానం చెపుతున్నాను విను. వేంకటాచలంపై ఉండే తీర్థాల పేర్లను గాని, వాటి మహిమగాని విస్తృతంగా తెలుపడానికి నూరు సంవత్సరాలు కూడా చాలవు) అని అన్నాడు.

11. శ్రీమతో వేంకటాచలస్య

అందమైన గొప్పదైన వేంకటాచలముయొక్క - అని అర్థం. శ్రీరాముని పవిత్ర సంచారాలవల్ల చిత్రకూటపర్వతం "సుభగశ్చిత్రకూటో-సౌ'' (ఈ చిత్రకూట పర్వతం అందమైనది) అని కీర్తింపబడినట్లే, భగవానుని నిత్యనివాసంవల్ల వేంకటాచలం "శ్రీమత్'' అనే విశేషణంతో విశేషింపబడుతున్నది.

సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే, తస్మాద్వేంకటశైలో-యం లోకే విఖ్యాతకీర్తిమాన్'' (భవిష్యోత్తర పురాణం-1-226) (పాపాలు అన్ని "వేం'' అని అనబడతాయి. "కట'' శబ్దం దహించే కార్యాన్ని తెల్పుతుంది. అన్ని పాపాలను ఈ కొండ దహిస్తుంది. కనుక "వేంకట'' మని అనబడుతున్నది) అని "వేంకారో-మృతబీజం తు కటమైశ్వర్య ముచ్యతే, అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః'' (వరాహ 4-31) (వేంకారం అమృతబీజాక్షరం. కటమంటే ఐశ్వర్యం. ఈ కొండ అమృతశబ్ద వాచ్యమైన మోక్షాన్ని, ఇహలోక సంపదలను ఇస్తుంది కనుక వేంకట మనబడుతున్నది) అని వేంకటశబ్దానికి రెండు వ్యుత్పత్తులు చెప్పబడ్డాయి. ఈ రెండు వ్యుత్పత్తులను దివ్యసూరులను తమ సూక్తులలో అనుసంధించారు. "వేమ్ కడఙ్గళ్ మెయ్ మేల్ వినై ము**ఱ్ఱ**వుమ్ తాఙ్గళ్ తఙ్గట్కు నల్లనవే శెయ్‌వార్, వేఙ్గడత్తుఱైవార్‌క్కు నమ వెన్నలామ్ కడమై అదు శుమన్దార్‌కట్కే'' (శ్రీ వేంకటేశ్వరుని ఉద్దేశించి నమస్కారం చేయడం కర్తవ్యం. దానిని ఆచరించినవారి పాపాలు నశిస్తాయి. ఇది నిజం.) అనే తిరువాయ్ మొళి (3-3-6) పాశురం దీనికొక ఉదాహరణం. ఈ అర్థాలను రెండింటిని పలువురు దివ్యసూరులు అనుసంధించిన వైనాన్ని "వినైచ్చుడరై నన్దువిక్కుమ్ వేఙ్గడమే'' - (ముదల్‌తిరు-36), "నీర్మైయాల్ వినైకెడుక్కుమ్ శేణుయర్ వేఙ్గడమ్'' - (నాన్ముకన్‌తిరు-42), "ప**ఎ**దొన్ఱుమ్ వాఱాదవణ్ణమే విణ్ కొడుక్కుమ్'' - (ముదల్‌తిరు-76) మొదలైన దివ్యసూరి సూక్తులు వెల్లడిస్తున్నాయి.



"వేమ్'' అనెడి అక్షరము సర్వపాపములను తెలుపుచున్నదని, కట మను పదము దహించుట అను అర్థమును తెలుపుచున్నదని, సర్వపాపములను దహించుటచే ఈ కొండకు ఈ పేరు యోగనామముగా బ్రహ్మచే పెట్టబడినదనియు భవిష్యోత్తరపురాణము లోని వేంకటాచల మహాత్మ్యమునందున్నది. బ్రహ్మ ఈ నామమును ఈ పర్వతమునకు పెట్టుటకుగల కారణమును వివరించుటకు మాధవుడను బ్రాహ్మణుని కథ అచట తెలుపబడినది.

మాధవుడనెడి బ్రాహ్మణుడు సర్వవేదవేదాంతశాస్త్రములలో వైదుష్యమును సంపాదించి,సత్ప్రవర్తనతో, గృహస్థాశ్రమధర్మములను అనుష్ఠించుకాలమున విధివశమున కుంతల అనెడి చండాలస్త్రీతో సహవాసము ఏర్పడి, తానుకూడ ఛండాలుడై, చిరకాలము గడపెను. పిమ్మట అతడు వేంకటాచలమునకు వచ్చి, పర్వతమును అధిరోహించునపుడు, అతని పూర్వకృతపాపములన్నియు ఈ పర్వతప్రభావమనెడి అగ్నిచే దహింపబడి, అతడు పవిత్రుడయ్యెను. దీనిని

చతుర్ముఖ బ్రహ్మ సాక్షాత్కరించి ఈ పర్వతమునకుగల ప్రభావమును గ్రహించి, "ఈ పర్వతమునకు వేంకటాచలమను పేరు కల్గుగాక!" అను వరమును ఇచ్చి, ఆ బ్రాహ్మణునకు "తిరుమలకు పోయి, స్వామి పుష్కరిణిలో స్నానముచేసి, ఈ శరీరమును త్యజింపుము. మరుజన్మలో నారాయణపురములో తొండదేశప్రభువుగా జన్మించి, జగన్మాత అగు మహాలక్ష్మిని పుత్రికగా పొంది, ఆమెను పరమపురుషుడగు శ్రీనివాసునకు కన్యాదానమును చేసి, ఆ పరమపురుషుని అల్లునిగా పొంది, సర్వభోగభాగ్యములను అనుభవించి, చివరగా వైకుంఠమనెడి మోక్షమును పొందుము" అను వరమును అనుగ్రహించి పోయెనని పురాణ వృత్తాంతము. ఈ కథయే బ్రహ్మపురాణములో కొంచెము వ్యత్యాసముతో కన్పించుచున్నది.

ఈ కథనమున, మాధవుని పాపములవలెనే అందఱి పాపములను పోగొట్టు స్వభావము ఈ కొండకు ఉండుటచే దీనిని వేంకటాచలమను పేరు కల్గెనని ఏర్పడుచున్నది. "వేంకారో-మృత బీజం తు కట మైశ్వర్య ముచ్యతే" అని తెలిపిన అర్థమునకును (మోక్షము, ఐశ్వర్యము అనబడు సర్వవిధపురుషార్థములను ఇచ్చునది అను అర్థమునకును) ఈ కథయే మూలము. మాధవునకు మఱుజన్మలో సర్వైశ్వర్యములను, సాక్షాత్ లక్ష్మిదేవినే కూతురుగను, పరమపురుషుని అల్లునిగను పొందు మహాభాగ్యమును, చివరలో మోక్షమును అనుగ్రహించినది ఈ పర్వతమగుటచే అని పల్కిన రీతిలో సర్వఫలములను అనుగ్రహించుననుటలో అడ్డము లేదుకదా! వేంకటపదము ద్రావిడభాషలో "వేఙ్గడమ్" అని మారును. "కడఙ్గళ్" అనగా కర్మములు పాపములు. "వేమ్" దగ్ధములగును కావున దహింపబడు పాపములను కల్గినది అనియు ఈ పదమునకు నమ్మాళ్వార్ల పాశురమును గొని అర్థము పూర్వాచార్యులచే తెలుపబడినదికూడ.

మఱియు, ఈ పర్వతమునకు కృతయుగములో వృషభాచలమని, త్రేతాయుగములో అంజనాద్రి అని, ద్వాపరయుగములో శేషాచలమని, కలియుగ ములో వేంకటాచలమనియు పేర్లు వ్యవహరింపబడునని ఈ భవిష్యోత్తర పురాణములోనే ప్రారంభమున తెలుపబడుటచే, కలియుగములోనున్న మనకు



వేంకటాచలమనెడి తిరునామమే మిక్కిలి ఆదరణీయమగుచున్నది.

(శ్రీమతః) - "యావదుక్తా భగవతః కల్యాణగుణరాశయః, తావంతో-స్య గిరేః సంతి గుణాః పరమపావనాః, అస్య వేంకటశైలస్య మాహాత్మ్యం యావదస్తి హి, తావద్వక్తుం చ కార్త్స్న్యేన న సమర్థశ్చతుర్ముఖః, షణ్ముఖశ్చ సహస్రాస్యః ఫణీ దేవాః పరే కిము?" (భగవానునకు చెప్పబడిన పరమ పవిత్రాలయిన కల్యాణగుణాలన్నీ ఈ కొండకు కూడా ఉన్నాయి. ఈ వేంకటాచల మహిమను అంతటిని తెలుపడానికి నాల్గు ముఖాలు కల బ్రహ్మగాని, ఆఱు ముఖాలు కల షణ్ముఖుడు, వేయి నోళ్ళను కల ఆదిశేషుడు గాని సమర్థులు కారు. ఇక ఇతరులనుగూర్చి చెప్పవలసినదేమున్నది) (వరాహ పు-4-35, 36) అనే వేంకటాచల మాహాత్మ్య వచనాలను బట్టి ఈ కొండకు కల సమస్త కల్యాణ గుణాకరత్వం అనే సంపద వ్యక్తమౌతున్నది.

భగవత్కైంకర్యమేకదా నిజమైన సంపద. "నివాసశయ్యాసన పాదుకాంశుకో పధానవర్షాతపవారణాదిభిః శరీరభేదై స్తవ శేషతాంగతై ర్యథోచితం శేష ఇతీరితే జనైః" (ఆదిశేషుడు భగవానునకు నివాసంగా, శయ్యగా, ఆసనంగా, పాదుకలుగా, వస్త్రంగా, తలదిండుగా, గొడుగుగా, ఇంకా అనేక విధాలుగా రూపొంది సేవను చేస్తాడు. అందువల్ల అతడు శేషుడని పిలువబడుతున్నాడు.) అని ఆళవందార్, "శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్ నిన్ఱాల్ మరవడియామ్.... పుల్కుమ్ అణైయామ్ తిరుమాఱ్కరవు" (భగవానుడు వేంచేసేటపుడు గొడుగుగా, కూర్చుంటే సింహాసనంగా, నిలిస్తే పాదుకలుగా.... శయనించే పడుకగా మాఱి ఆదిశేషుడు శ్రీభగవానునకు సేవచేస్తాడు.) (ముదల్ తిరువన్దాది) అని పొయ్కై ఆళ్వార్ పల్కిన రీతిలో భగవానునకు సర్వవిధ సార్వకాలిక సార్వత్రికమైన కైంకర్యాన్ని చేసే ఆదిశేషుడు భగవత్కైంకర్యమనే సిరిని కలవాడు. కనుక అతడు "శ్రీమాన్" ఆదిశేషుడే పర్వతరూపాన్ని ధరించి భగవానునకు కైంకర్యం చేసే క్రీడాద్రిగా నిలచాడు కనుక ఈ "శ్రీమత్" విశేషణ ఈ పర్వతానికి సార్థకం.

శ్రీవేంకటాచలమాహాత్మ్యంలోకూడా వేంకటాచలవైభవం పలుచోట్ల స్తుతింప

బడింది. వరాహపురాణం, రెండవ భాగం మొదటి అధ్యాయంలో "శ్రీవేంకటాచలో నామ వాసుదేవాలయో మహాన్, సప్తయోజనవిస్తీర్ణః శైలేంద్రో యోజనోచ్ఛ్రితః" (వాసుదేవునకు నిలయమైనది, గొప్పది అయిన శ్రీవేంకటాచల మనే పర్వతం ఏడు యోజనాల విస్తీర్ణాన్ని, ఒక యోజనం ఎత్తును కల్గినది) అని, పద్మపురాణం నాల్గవ అధ్యాయంలో "సువర్ణముఖరీతీరే కశ్చిదస్తి మహీధరః, వేంకటాచల నామా-సౌ సర్వభూభృత్కులోత్తమః" (సువర్ణముఖి నదీతీరంలో అన్ని పర్వతాలలో గొప్పది, వేంకటాచలమనే పేరును కల్గినది అయిన ఒక గొప్ప పర్వతం ఉన్నది) అని, బ్రహ్మాండపురాణం మొదటి అధ్యాయంలో - "శ్రీవేంకటగిరిర్నామ క్షేత్రం పుణ్యం మహీతలే, సర్వపాపప్రశమనం సర్వపుణ్య వివర్ధనమ్" (ఈ భూతలంపై గల శ్రీవేంకటాచలమనే క్షేత్రం అన్ని పాపాలను పోగొడుతుంది, అన్ని పుణ్యాలను వృద్ధిచేస్తుంది) అని తెలుపబడడం గమనించవచ్చు. ఈ విధంగా అన్నివిధాలుగా ఈ పర్వతం శ్రీమత్త్వాన్ని కల్గి ఉన్నది.

12. శిఖరశేఖరమహాకల్పశాఖీ,

శిఖరశేఖర = గొప్ప శిఖరమునకు అలంకారమగు, మహాకల్పశాఖీ = గొప్ప కల్పవృక్షమువంటివాడు.

"తన్నై త్తన్ద కఱ్పకమ్" అని నమ్మాళ్వార్లు స్తుతించినట్లుగా భగవానుడు అన్ని మనోరథాలను అనుగ్రహించడంతోపాటు తన అనుభవాన్నికూడా భక్తులకు అనుగ్రహిస్తాడు. అందువల్ల అతడు విలక్షణమైన మహాకల్పవృక్షం. ఈ విధంగా "మహత్" అనే విశేషణం సార్థకం, సాభిప్రాయకం. బ్రహ్మోత్సవాలలో కల్పవృక్ష వాహనంపై శ్రీస్వామి తిరువీథులలో వేంచేసే సందర్భం దీనిని స్మరింపజేస్తుంది.

13. ఖర్వీభవదతిగర్వీకృతగురుమేర్వీశగిరిముఖోర్వీధరకులదర్వీకర దయితోర్వీ ధరశిఖరోర్వీసతతసదుర్వీకృతిచణనవఘనగర్వచర్వణనిపుణ తనుకిరణ మసృణిత గిరిశిఖరశేఖర తరునికరతిమిరః,

ఖర్వీభవత్ = తక్కువగా (పొట్టివిగా) అగుచున్న, అతిగర్వీకృత = మిక్కిలిగా గర్వించిన, గురు = గొప్పవైన, మేరు = మేరుపర్వతము, ఈశగిరి= కైలాసపర్వతము, ముఖ = మొదలగు, ఉర్వీధరకుల = పర్వతసమూహమును



కల, దర్వీకరదయిత+ఉర్వీధర = శేషాచలముయొక్క, శిఖర = శిఖరములలోని, ఉర్వీ = భూమియందు, సతత = ఎల్లప్పుడు, సదుర్వీకృతి = గొప్పగా విస్తరించుటలో, చణ = సమర్థమైనది, నవఘన = నూతన (నల్లని) మేఘము యొక్క, గర్వ = అతిశయమును, చర్వణ = అనుభవించుటలో, నిపుణ= సమర్థమైనదగు, తను = దివ్యమంగళ విగ్రహము యొక్క, కిరణ = కాంతికిరణ ములతో, మసృణిత = మఱింత చిక్కగా చేయబడిన, గిరిశిఖరశేఖర = శేషాచలమందలి గొప్ప శిఖరముపై గల, తరునికర = వృక్షసమూహముచే ఏర్పడిన, తిమిరః = కాంతిని కలవాడు.

భగవానుడైన శ్వేతవరాహస్వామి సాన్నిధ్యంవల్ల, శ్రీవేంకటేశ్వరుని సాన్నిధ్యంవల్ల కల్గిన అతిశయంచేత శ్రీవేంకటాచలంతో పోల్చినపుడు మేరుపర్వతం, కైలాసగిరి మొదలైన గొప్ప పర్వతాలన్నీ న్యూనాలు అయినది. అటువంటి వేంకటాద్రిపై "మఞ్గుల్ తోయ్ శెన్నీ వడవేఙ్గడమ్" (మేఘ మండలాన్ని తాకే శిఖరాలను గల వేంకటాద్రి), "మిన్నార్ ముకిల్శేర్ తిరువేఙ్గడమ్" అనేటట్లు ఎల్లప్పుడు మేఘాలు విస్తరించి ఉంటాయి. అటువంటి నీలమేఘాల గర్వాన్ని శోభలో, అందంలో హరించగల్గినవి, స్వామి దివ్యదేహంయొక్క నీలకిరణాలు. స్వామి దివ్యమంగళ విగ్రహం నీలవర్ణం కనుక, ఆ విగ్రహంనుండి వెలువడిన కాంతులు నవమేఘాల కాంతినికూడా మించి ఉన్నాయి. అటువంటి నీలమేఘాల గర్వాన్ని శోభలో, అందంలో హరించల్గినవి స్వామి దివ్యదేహ కాంతులు. ఆ నల్లని కాంతులతో, సహజంగానే దట్టమైన వృక్షసముదాయం యొక్క కాంతులవల్ల, నవ మేఘాల కాంతులతో వేంకటాద్రిపై వ్యాపించిన చీకటి మఱింత దట్టమై, చిక్కనిది అయినది.

14. వాణీపతి శర్వాణీదయితేంద్రాణీశ్వరముఖనాణీయోరసవేణీనిభ శుభవాణీ నుతమహిమాణీయస్తరకోణీ భవదఖిలభువన భవనోదరః।

వాణీపతి = బ్రహ్మ, శర్వాణీదయిత = శివుడు, ఇంద్రాణీశ్వర = ఇంద్రుడు, ముఖ = మొదలగువారి, నాణీయోరసవేణీనిభ = గొప్పవి అయిన రసప్రవాహ ముల వంటి, శుభవాణీ = మంగళవాక్కులతో, నుత = స్తుతింపబడిన,

మహిమా = మహిమయందలి (కల్గినది), అణీయస్తరకోణీభవత్ = అతిచిన్న భాగమందు ఏదో ఒక మూల అణగుచున్న, అఖిలభువన భవన = సమస్తభువనములకు స్థానమైనది అయిన, ఉదరః = ఉదరమును కలవాడు.

"నీలార్ కణ్డత్తమ్మానుమ్ నిఱైనాన్మ్కనుమ్ ఇన్దిరనుమ్ శేలేయ్ కణ్ణార్ పలర్ శూఴ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తాన్" (నల్లని కంఠాన్ని కల్గిన శివుడు, అతనికంటే జ్ఞానభక్తులలో గొప్పవాడైన బ్రహ్మ, ఇంద్రుడు, చేపలవంటి అందమైన కన్నులుగల తమ భార్యలు పలువురు వెంట రాగా సేవించే శ్రీవేంకటే శ్వరుడు) అని శఠకోపసూరి, "తిఙ్గళ్ శడై యేఱ వైత్తానుమ్ తామరై మేలానుమ్ కుడై యేఱ త్తాఙ్గువిత్తుక్కొణ్డు మఙ్గుల్ తోయ్ శెన్ని వడవేఙ్గడత్తానై కఙ్గుల్ పుకున్దార్కళ్ కాప్పణివాన్" (చంద్రుని జటలలో కల్గిన శివుడు, తామరపై ఉండే బ్రహ్మ గొడుగులు మొదలైనవానిని తీసికొని మేఘాలు సంచరించే శిఖరాలను కల్గిన, ఉత్తర దిక్కులో ఉండే శ్రీ వేంకటాద్రికి ప్రభువైన స్వామికి సాయంసంధ్యా సమయంలో మంగళహారతి ఇవ్వడం కోసం వస్తారు) అని, "కడిక్కమల నాన్మ్కనుమ్ కణ్మూన్తత్తానుమ్ అడిక్కమల మిట్టేత్తుమఙ్గు" (సుగంధాన్ని కల్గిన తామరపూవుపై ఉండే చతుర్మ్ముఖుడు, మూడు కన్నులు గల శివుడు శ్రీవేంకటేశ్వరుని పాదాలలో పద్మాలను సమర్పించి సేవిస్తారు.) అని భక్తిసారులు, "పిన్నిట్ట శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్ తున్నిట్టు ప్పుకలఱియ వైకున్ద నీళ్వాశల్ మిన్వట్ట చ్చుడరాఴ వేఙ్గడక్కోన్" (పేనిన జటలను కల శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు ఒకరిని ఇంకొకరు తోసికొంటూ లోపలకు పోవడానికి వీలుకాని భూలోక వైకుంఠమైన వేంకటాచలంలోని ఆలయం వాకిటిలో మెరపువలె మెరిసే సుదర్శనాన్ని ధరించిన వేంకశ్వరుడు) అని, "పిఱై యేఱు శడైయానుమ్ పిరమను మిన్దిరనుమ్ ముఱైయాయ పెరు వేళ్వి కుఱైముడిప్పాన్ మఱైయానాన్" (జటలలో చంద్రుని కల్గిన శివునకు, బ్రహ్మకు, ఇంద్రునకు వారి విధిప్రకారం చేసిన యాగాల ఫలితాలను వారికి అనుగ్రహించేవాడు, వేదప్రతిపాద్యుడు) అని కులశేఖరులు, "ఆడు తామరైయోనుమ్ ఈశనుమ్ అమరర్కోనుమ్ నిన్తేత్తుమ్ వేఙ్గడత్తు ఆడుకూత్తనుక్కు" (తామరపూవుపై ఉండే బ్రహ్మ, ఈశ్వరుడు, దేవతలకు



ప్రభువైన ఇంద్రుడు నిలచి సేవించే వేంకటాచలంపై గల కుంభనృత్యం చేసిన స్వామికి) అని పలు చోట్ల తిరుమలను, శ్రీవేంకటేశ్వరుని మహిమను బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు స్తుతిస్తునట్లు దివ్యసూరులు పలికారు. ప్రళయసమయంలో సమస్తలోకాలను గ్రసించినా, అవి భగవానుని ఉదరంలోని ఒక మూలకు కూడా చాలవు. "పారార్ ఉలకుమ్ పనిమాల్ వరైయుమ్ కడలుమ్ శుడరుమ్ ఇవై ఉణ్డుమ్ ఎనక్కు ఆరాదెన నిన్తవన్ ఎమ్బెరుమాన్" (విశాలమైన భూమిని, కులపర్వతాలను, సముద్రాలను, సూర్యచంద్రులను ఆరగించినా, ఇంకా తృప్తిచెందని స్వామి) అని ఆవ్వార్లు అన్నారు కదా! ఆ స్వామి "ఉలకు ముణ్డ పెరువాయా!" (లోకాలను ఆరగించిన పెద్ద నోటిని గలవాడా!) అని కీర్తింపబడే శ్రీవేంకటేశ్వరుడే కదా! "ఎణ్ తిశైకళుమ్ ఏఴులకముమ్ వాఙ్గి పొన్ వయిట్టిల్ పెయ్తు... అరియాయవన్ తిరువేఙ్గడమ్" (ఎనిమిది దిక్కులను, ఏడు లోకాలను ఆరగించి తన అందమైన ఉదరంలో పెట్టుకొని... హరియైనవాని వేంకటాద్రి) అని, "నీరార్ కడలుమ్ నిలముమ్ ముఴుతుణ్డు... శీరార్ తిరువేఙ్గడమామలైమేయ ఆరావముదే!" (నీటితో నిండిన సముద్రాన్ని, భూమిని పూర్తిగా ఆరగించి.... కల్యాణగుణాలను నిండుగా గల్గిన శ్రీ వేంకటేశ్వరుడు ఆదరంతో వేంచేసేఉండే) అని తిరుమఙ్గైయాళ్వార్లు కూడా లోకాలను ఆరగించిన వృత్తాంతాన్ని శ్రీవేంక టేశ్వరుని పరంగా అనుసంధించిన అంశం స్మరణీయం.

**15.** వైమానికగురుభూమాధికగుణ రామానుజకృతధామాకరకరధామారిదర లలామాచ్ఛకనకదామాయిత నిజరామాలయనవకిసలయమయతోరణ మాలాయితవనమాలాధరః,

వైమానికగురు = దేవతలకు గురువైన బృహస్పతియొక్క భూమ + అధిక గుణ= బుద్ధివైభవముకంటే పలు రెట్లు అధికమైన బుద్ధివైభవమును కల్గినవారైన, రామానుజకృత = భగవద్రామానుజులచే సమర్పింపబడిన, ధామ+ఆకర =తేజస్సుకు నిలయమైన, కర = శ్రీహస్తాలను, ధామ = నిలయంగా - ఆశ్రయంగా కల్గినవి అగు, అరిదరలలామ = గొప్ప శ్రీసుదర్శనానికి, పాంచజన్యానికి, అచ్ఛకనక

దామాయిత = (అలంకారమైన) స్వచ్ఛమైన బంగారుపూల మాల వంటిది, నిజ రామా = తన ప్రేయసి అయిన లక్ష్మిదేవికి, ఆలయ = గృహమైన తన వక్షస్సుకు, నవకిసలయమయ = కొత్తవి అయిన చిగుళ్ళతో చేయబడిన, తోరణ మాలాయిత = ద్వారబంధ మాలికవంటిది అగు, వనమాలాధరః = వనమాలను ధరించినవాడు.

వైమానికులంటే దేవతలు. విమానంలో సంచరించేవారు అని అర్థం. భగవద్రామానుజుల బుద్ధి వైభవం దేవతల గురువైన బృహస్పతిబుద్ధి బలం కంటే పలురెట్లు మిన్న అయినది. ఆ మహాచార్యులు వివరించిన శ్రీభాష్యాది ఉద్గ్రంథాలే దానికి తిరుగులేని సాక్ష్యాలు. శ్రీ రామానుజులు శ్రీవేంకటేశ్వరునకు శంఖచక్రాలను సమర్పించిన వృత్తాంతాన్ని శ్రీవేంటాచలేతిహాసమాల, తిరుమలై ఒఒకు మొదలైన సంప్రదాయ చరిత్రగ్రంథాలలో గమనించవచ్చు. వడగ నంబి (ఆంధ్రపూర్ణులు) రచించిన శ్రీరామానుజాష్టోత్తర శతనామస్తోత్రంలోని "శ్రీవేంకటాచలాధీశశంఖచక్రప్రదాయకః" అనే నామం ఈ ఉదంతాన్ని తెల్పుతున్నది. అరాలను (రేకులను) కలిగినది అరి. అంటే - సుదర్శనం. ధరం అంటే శంఖం. లోపల రంధ్రాన్ని కల్గినది అని అర్థం.

తన భక్తుడైన తొండమాన్ చక్రవర్తిపై శత్రువులు దండెత్తి వచ్చినపుడు, అతనికి సహాయం చేయగోరిన వేంకటేశ్వరుడు తన శ్రీహస్తాలలోని శంఖ చక్రాలను అతనికి అనుగ్రహించాడు. వాటి సహాయంతో ఆ ప్రభువు శత్రువులను జయించాడు. అప్పటి నుండి వేంకటేశ్వరుడు తన చేతులలో శంఖ చక్రాలు లేకుండా దర్శన మిచ్చాడు. కొన్నాళ్ళకు తిరుమలపై ఉండే మూర్తి ఏరూపం అనే విషయంలో పలు వాదాలు ఏర్పడినపుడు యాదవరాజు ఆహ్వానంపై శ్రీరామానుజులు తిరుపతికి వచ్చి, వేదాగమపురాణదివ్యసూరి సూక్తులనుండి పలు ప్రమాణాలను ఉట్టంకించి, తిరుమలపై వేంచేసి ఉండే రూపం విష్ణువేనని నిరూపించి, స్థాపించి, అన్యవాదాలను నిరసించడమే కాక, ప్రతివాదుల కోరిక మేరకు శ్రీవేంకటేశ్వరునకు శంఖచక్రాలను సమర్పించి, ఆ స్వామికి ఆచార్యులయ్యారు.

ఆస్వామి వక్షఃస్థలంలో అలంకరింపబడిన వనమాలిక, శ్రీరామానుజులు



శ్రీవేంకటేశ్వరుని శ్రీహస్తాలలో సమర్పించిన శంఖచక్రాలకు అపూర్వమైన శోభను కల్గిస్తున్నది, వాటికి అలంకారంగా, స్వచ్ఛమైన బంగారంతో చేయబడిన మాలిక వలె వనమాల శోభిల్లుతున్నది. స్వామికి వల్లభ అయిన లక్ష్మీదేవి "అకల కిల్లేన్ ఇఱైయు మెన్ఱుఅలర్‌మేల్ మఙ్గైయుఱై మార్బా!" (క్షణంకూడా విశ్లేషించ లేనని అంటూ పద్మావతీదేవి నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా!) అనే రీతిలో అతని హృదయసీమలో కుడివైపున నిత్యవాసం చేస్తున్నది. అందువల్ల స్వామి వక్షఃస్థలం లక్ష్మికి నిలయం. ఆ నిలయంయొక్క ద్వారబంధానికి అలంకారంగా కట్టిన, కొత్త కొత్త చిగుళ్ళతో కూర్చిన తోరణ మాలికవలెకూడా వనమాల భాసిస్తున్నది. ఇటువంటి వైలక్షణ్యాన్ని కల వనమాలికను శ్రీవేంకటేశ్వరుడు తన వక్షస్సులో ధరించి ఉన్నాడు.

**16.** కాలాంబుదమాలానిభనీలాలకజాలావృతబాలాబ్జసలీలామలఫాలాంక సమూలామృతధారాద్వయావధీరణధీరలలితతరవిశదతర ఘనఘన సారమ యోర్ధ్వపుండ్ర రేఖాద్వయరుచిరః,

కాలాంబుదమాలా = నల్లని మేఘమాలతో, నిభ = పోలిన, నీల = అలకజాల = నల్లని ముంగురుల సమూహంతో, అవృత = ఆవరింపబడినది, బాల+అబ్జసలీల = బాలచంద్రునివంటిది, అమల =స్వచ్ఛమైనది అయిన, ఫాలాంక = ఫాలభాగముయొక్క అంకమును, సమూల = మూలముగ కూడినవై, (మూలమును కల్గినవై) అమృతధారాద్వయ = అమృతధారలను రెండిటిని, అవధీరణ = హేళన చేయుటయందు, ధీర = ధైర్యమును కల్గినది, లలితతర= మిక్కిలి అందమైనవి, విశదతర = మిక్కిలి స్పష్టమైనవి, ఘన = గొప్పవి, ఘనసారమయ = పచ్చకర్పూరముతో దిద్దబడినవి అగు, ఊర్ధ్వపుండ్ర రేఖాద్వయ= ఊర్ధ్వపుండ్రరేఖలు రెండిటితో, రుచిరః = ఆకర్షణీయమైనవాడు. (ప్రకాశించేవాడు)

శ్రీవేంకటేశ్వరునకు గల అందమైన దీర్ఘమైన కేశపాశం సుప్రసిద్ధం. ఆ స్వామి ముంగురులు నల్లని మేఘాలమాల వంటివి. "నీలాబ్జాభైః సమః కచః" అని కేశాలను నీలమేఘాలతో పోల్చడం కవిసమయం. అదే విధంగా

ఫాలభాగాన్ని బాలచంద్రునితో ఉపమించడంకూడా కవిసమయమే. "లలాట మర్ధచంద్రేణ" అని అలంకారశేఖరకారుని వచనం. ఫాలం మూలభాగం నుండి పైకి నిలువుగా దిద్దబడిన తెల్లని ఊర్ధ్వపుండ్ర రేఖలను అమృతధారగా ఉపమించడం శ్రీపరాశరభట్టరు ప్రణీతమైన శ్రీరంగరాజస్తవంలో గమించ దగినది. "హృదయం ప్రసాదయతి రంగపతే మధురోర్ధ్వపుండ్రతిలకం లలితమ్, అళికార్ధ చంద్రదళ సంవళితామృతస్రుతిం యదభిశంకయతే" (శ్రీరంగనాథుని ఫాలమనే అర్ధచంద్రమండలం నుండి ప్రవహించే అమృత ప్రవాహమా? అనే శంకను శ్రీరంగనాథుని అందమైన, ఋజువైన ఊర్ధ్వపుండ్రం కల్గిస్తున్నది) అనే అచటి సూక్తి స్మరణీయం. ఫాలాన్ని చంద్రునితో పోల్చినపుడు, సుధానిధి అయిన చంద్రుని నుండి జాలువారే రెండు అమృతధారలుగా తెల్లని ఊర్ధ్వపుండ్ర రేఖలను సంభావించడం ఉచితమేకదా. అయితే, ఇక్కడ ఊర్ధ్వపుండ్ర రేఖలు అమృతధారలను సైతం అవహేళన చేస్తున్నవి. ఎందుకు? అంటే, అమృతం కేవలం రూపానికి నాశం కలుగకుండా రక్షించగలదు. అంతే. కాని, ఈ ఊర్ధ్వపుండ్రరేఖలు "ఉద్ధరత్యుపరి భక్తజనానితి ఊర్ధ్వతాశ్రయణ సూచితశక్తిమ్, ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్ కిం బిభర్షి వరద! స్వలలాటే" (వరదరాజస్వామీ! ఈ ఊర్ధ్వపుండ్రం భగవద్భక్తులకు ఊర్ధ్వగతిని కల్గిస్తున్నది అనేవిషయాన్ని తాను ఊర్ధ్వాకారాన్ని కల్గిఉండడం ద్వారా సూచిస్తున్నది. ఇటువంటి శక్తిని కల ఊర్ధ్వపుండ్ర తిలకాన్ని నీవు లలాటంలో 'నా భక్తులు దీనిని అభిమానిస్తున్నారు' అనే ప్రీతితో ధరిస్తున్నావా ఏమి?) అనే కూరేశుల సూక్తిప్రకారం భక్తుల స్వరూపాన్ని కూడా రక్షిస్తుందికదా! ఈ విధంగా ప్రకృతంలో కూరేశుల- భట్టర్ సూక్తుల భావాలు అనుసంధింపబడ్డాయని చెప్పవచ్చు. దేవలోకంలోని అమృతం యొక్క ధారలు ఐశ్వర్యార్థుల జిహ్వాకు మాత్రమే రుచిరాలు. కాని ఈ ఊర్ధ్వపుండ్రరేఖలు అనన్యభక్తులైన పరమై కాంతుల నేత్రాలకు, మనస్సుకు కూడా రుచిరాలు - ఇత్యాదిగా పలు వైలక్షణ్యాలు ఇక్కడ భావ్యాలు.

"మూర్ధజైః కుంచితైశ్చాపి నీలైః మృదుతరైస్తథా, లంబమానైః వినిష్క్రాంతైః కిరీటాత్ శుభదర్శనాత్" అనే వామనపురాణ (34వ అధ్యాయం) సూక్తి



శ్రీవేంకటేశుని కేశసౌందర్యాన్ని తెల్పుతున్నది.

"అష్టమీందుకళాకారలలాటస్థోర్ధ్వపుండ్రకః" (అష్టమినాటి చంద్రుని వంటి లలాటంలో ఊర్ధ్వపుండ్రాన్ని కలవాడు) అనే పద్మ పురాణం (27వ అధ్యాయం) లోని సూక్తి శ్రీనివాసుని ముఖంలోని ఊర్ధ్వ పుండ్రాన్నిగూర్చి తెలియజేస్తున్నది. ఈ సూక్తి అర్థాన్ని శ్రీమదనంతార్యసూరి శ్రీవేంకటాచలేతిహాసమాలలో - "అర్థీకృతపూర్ణేందు మండలాకారమూలభాగ - తదుపరి ఊర్ధ్వనిఃసృత సుధారేఖాద్వయాకార సాంతరాళరేఖాద్వయాత్మకోర్ధ్వపుండ్ర విన్యాసస్యైవ అభిధీయమానతయా" (పూర్ణచంద్రుని మండలానికి సగభాగంలో - అంటే - అష్టమీచంద్రుని ఆకారంలో గల మూలభాగాన్ని (పాదాన్ని) కల్గి, దానిపై పైకి వెలువడిన రెండు అమృతధారల ఆకారంలో మధ్యలో అవకాశాన్ని కల్గిన రెండు రేఖల రూపంలోని ఊర్ధ్వపుండ్ర విన్యాసం తెలుప బడడంవల్ల) అని చేసిన వివరణతో ప్రస్తుతచూర్ణిక పోలి ఉండడం గమనించవచ్చు. భవిష్యోత్తర పురాణంలోని 11వ అధ్యాయంలోగల "అష్టమీందుకళాకారే లలాటే దర్పణస్ఫుటే, ఊర్ధ్వపుండ్రం దధారాథ శ్రీనివాసస్సతాంగతిః" (అష్టమి చంద్రునివంటి, అద్దంవలె స్వచ్ఛమైన లలాటంలో సత్పురుషులకు గతియైన శ్రీనివాసుడు ఊర్ధ్వపుండ్రాన్ని ధరించాడు.) అనే సూక్తి వివాహసమయంలో శ్రీనివాసుడు నుదుటిలో ధరించిన ఊర్ధ్వపుండ్రాన్ని తెల్పుతున్నది.

17. సువికస్వర దళభాస్వర కమలోదర గతమేదుర నవకేసర తతిభాసుర పరిపింజర కలితాంబర కలితాదర లలితోదర తదాలంబజంభ రిపుమణిస్తంభ గంభీరిమదంభస్తంభన సముజ్జృంభమాణ పీవరోరుయుగళ తదాలంబ పృథులకదళీ ముకుళ మదహరణ జంఘాలజంఘాయుగళః,

సువికస్వర = బాగుగా వికసించిన, దళ = రేకులతో, భాస్వర = ప్రకాశించు, కమల = పద్మముయొక్క, ఉదరగత = గర్భమున గల, మేదుర = దట్టమైన, నవ = క్రొత్తవైన, కేసర = కింజల్కముల, తతి = సమూహమువలె, భాసుర = ప్రకాశవంతమైన, పరిపింజర =అంతట పింజరవర్ణమును కల్గినదిగా (ఎఱుపు-పసుపుల కలయికను కల - స్వర్ణవర్ణము), కనకాంబర = స్వర్ణాంబరమునందు (బంగారు వస్త్రముపట్ల), కలిత+ఆదర = ఆదరమును కల్గినదగు,

లలిత+ఉదర= అందమైన (సుకుమారమైన) ఉదరమును, తదాలంబ = దానిని ఆధారముగా కల్గిన, జంభరిపుమణిస్తంభ = ఇంద్రమణులు పొదిగిన స్తంభముల, గంభీరిమ =గాంభీర్యమును, దంభ = గర్వమును, స్తంభన = స్తంభింపచేయుట చేత, సముజ్జృంభమాణ = మిక్కిలి వర్ధిల్లుచున్న, పీవర = బలమైన, ఊరు యుగళ= ఊరుద్వయమును, తదాలంబ = ఆ ఊరువులను ఆధారముగా కల, పృథుల= పెద్దవైన, కదళీముకుల = అరటి మొగ్గల, మదహరణ = మదమును హరించుట యందు, జంఘాల = గొప్ప వేగముగా పరుగు తీయగల, జంఘాయుగళః = పిక్కలను రెండిటిని కలవాడు.

బాగా వికసించిన పద్మంలోపల ఉండే కేసరాలు కొంచెం ఎఱుపు రంగు కలిసిన పింజర వర్ణంతో ఉంటాయి. ఆ వర్ణమే కదా భగవానుని పీతాంబరం యొక్క రంగు. పింజరవర్ణమంటే ఎఱుపు-పసుపు రంగుల కలయికతో ఏర్పడిన వర్ణం. "శిఖా ప్రదీపస్య సువర్ణపింజరా" అనే కాళిదాసు మాళవికాగ్ని మిత్ర ప్రయోగంవల్ల (3-17) ఈ వర్ణమే స్వర్ణవర్ణం.

ఈ పీతాంబరాన్ని ధరించిన స్వామి నడుము చాలా సుకుమారమైనది. అందమైనది. దానిని ఆధారంగా చేసికొన్నవి స్వామి రెండు ఊరువులు. శ్రీవేంకటేశ్వరుని ఊరుయుగానికి ఇంద్ర నీలమణులతో నిర్మింపబడిన స్తంభాల కంటే ఆధిక్యం, పిక్కలకు అరటి మొగ్గలకంటే ఆధిక్యం చెప్పబడింది. అందువల్ల వ్యతిరేకాలంకారం ధ్వనిస్తున్నది.

చక్కగా వికసించిన దళాలతో శోభిల్లే కమలం మధ్యలో ఉండే దట్టమైన నూతన కేసరాలవలె భాసిల్లుతున్నది, కొంచెం ఎఱుపుతో కూడిన పసుపుపచ్చని వర్ణాన్ని కల్గిన పట్టువస్త్రాన్ని శ్రీస్వామి నడుమున ధరించి ఉన్నాడు. అతడు పీతాంబరుడు కదా! పీతాంబరధారిత్వం పరత్వసూచకం. స్వామి నడుమును ఆధారంగా చేసికొని ఉండే రెండు బలమైన నల్లని రంగులో ప్రకాశించే ఊరువుల ముందు ఇంద్రనీలమణులతో నిర్మింపబడ్డ బలమైన స్తంభాలు దిగదుడుపే. ఆ ఊరువుల క్రిందకు కొంచెం దర్శిస్తే, బాగా బలిసిన, ఆకారంలో అరటి మొగ్గల సొబగును మించిన అందాన్ని కల్గిన పిక్కలు సాక్షాత్క



రిస్తున్నాయి. "జంఘాల" శబ్దప్రయోగం చాలా విలక్షణమైనది. జంఘాలుడంటే బాగా వేగంగా పరుగు తీయగలవాడు. గజేంద్రుని రక్షించిన సందర్భంలో స్వామి తీసిన పరుగు సుప్రసిద్ధం. ఆశ్రితులైన పాండవులకోసం సుదూరం పయనించి దౌత్యం నిర్వహించినవాడుకదా అతడు. "ప్రజ్ఞాలప్రజ్ఞిలౌ తుల్యౌ జంఘాలజంఘిలాదయః" అని అమరసుధా వ్యాఖ్యానకారుడు వాచస్పతి నిఘంటు వచనాన్ని ఉట్టంకిస్తూ ప్రజ్ఞాల, ప్రజ్ఞల, జంఘాల, జంఘిల శబ్దాలను పర్యాయాలుగా తెలిపాడు. "జంఘన్యతే ఇతి జంఘా" అనే వ్యుత్పత్తినిబట్టి జంఘాశబ్దం గత్యర్థకధాతువునుండి పుట్టినది. గత్యర్థక ధాతువులన్నీ జ్ఞానార్థకాలే కనుక, జంఘాల శబ్దానికి అతిశయించిన గతిని కలవాడనే అర్థాన్నిబట్టి, గొప్ప ప్రజ్ఞను కలవాడనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. ఆ అర్థాని ప్రకృతంలో గ్రహిస్తే "మదహరణజంఘాల" అనే ప్రయోగానికి మదాన్ని హరించడంలో మిక్కిలి నిపుణుడనే అర్థాన్ని చెప్పడంలో కూడా స్వారస్యం ఉన్నది. పిక్కల అరటి మొగ్గలతో పోల్చడం కూడా కవిసమయం.

**18.** నవ్యదళ భవ్యకల పీతమల శోణిమల సన్మృదుల సత్కిసలయాశ్రుజలకారి బలశోణతల పత్కమలనిజాశ్రయ బలబందీకృతశరదిందుమండలీ విభ్రమదాద భ్రశుభ్ర పునర్భవాధిష్ఠితాంగులీ గాఢనిపీడిత పద్మాసనః,

నవ్య = నూతనములైన, దళ = దళములచే, భవ్య = మంగళకరమైనది, కల = అందమైనది, పీతమల = త్రాగబడిన మలినము గల (నిర్మలమైన), దోషరహితమయిన, శోణిమ = ఎఱ్ఱని రంగుచే, లసత్ = ప్రకాశించు, మృదుల= సున్నితమైన, కిసలయ = చిగురుటాకునకు, అశ్రుజలకారి = కన్నీళ్ళను కలుగచేయు (చిగురుటాకును మించిన), బల = బలమును కల, శోణతల = ఎఱ్ఱని క్రింది భాగమును కల, పత్ = శ్రీపాదములనెడి, కమల = కమలము అను, నిజ+ ఆశ్రయ = తన ఆశ్రయముయొక్క, బల= బలముచే, బందీకృత= బందీచేయబడివి అగు, శరత్+ఇందుమండలీ = శరత్కాల చంద్రమండలి యొక్క, విభ్రమద = భ్రమను కల్గించునవి, అదభ్రశుభ్ర = తక్కువ కాని (అనల్పములైన) శుభ్రములైన, పునర్భవ = గోళ్ళతో, అధిష్ఠిత = అధిష్ఠింపబడిన, అంగులీ =కాలివేళ్లచే, గాఢనిపీడిత = గాఢముగా పీడింపబడిన, పద్మ+ఆసనః

= ఆసన పద్మమును కలవాడు.

ఇందులో స్వామి శ్రీచరణాలు, నఖాలు, ఆసనపద్మం వర్ణింపబడు తున్నాయి. స్వామి శ్రీచరణాల క్రిందిభాగం అపుడే తొడిగిన ఆకులను కల్గిన, మంగళకరమైన, అందమైన, ఏదోషం లేని, ఎఱ్ఱని కాంతితో ప్రకాశించే మృదువైన చిగురుటాకు నకు కూడా కన్నీళ్ళను కల్గిస్తున్నది. అంటే- దానికి మించిన భవ్యతను అందాన్ని, శోభను, ఎఱ్ఱదనాన్ని, మృదుత్వాన్ని కల్గి ఉన్నది. ఆ శ్రీచరణాలు కమలాల వలె ఉన్నవి. ఆ శ్రీచరణ కమలాలను స్వామి ఆశ్రయించిన బలంచేత పాదాల లోని తెల్లని నఖాలు శరత్కాల చంద్రుల సమూహాన్ని బందీగా చేసికొన్నాయి. గొప్పవారిని ఆశ్రయించినవారు ఎవరినైనా వశం చేసికోగలరు కదా! స్వామి ఆసనపద్మంలోని నఖాలను గట్టిగా అదిమి గాఢంగా నిలిచి వేంచేసి ఉండే సన్నివేశాన్ని చమత్కారంగా వర్ణించిన తీరు ఇది. నఖాలను శరత్కాల చంద్రునితో పోల్చడం కవిసమయం. అదే విధంగా శ్రీచరణాల క్రింది భాగంలోని ఎఱుపురంగును చిగుళ్ళ రంగుతో పోల్చడం కూడా ప్రసిద్ధం. "పునర్భవ" శబ్దానికి గోళ్ళు అని అర్థం. "పునర్భవః కరరుహో నఖో-స్త్రీ నఖరో స్త్రియామ్" అని అమరకోశవచనం.

**19.** జానుతలావధిలంబివిడంబిత వారణశుండా దండవిజృంభిత నీలమణి మయ కల్పకశాఖా విభ్రమదాయి మృణాళలతాయిత సముజ్జ్వలతర కనక వలయ వేల్లితైకతర బాహుదండయుగళః,

జానుతల+అవధిలంబి = మోకాళ్ళవరకు వేలాడేవి (విస్తరించినవి), విడంబిత = అనుకరింపబడిన, వారణశుండాదండ = ఏనుగు తొండమును కల్గినది, విజృంభిత = గొప్పగా వృద్ధి చెందిన, నీలమణిమయ = నీలమణులతో కూడిన, కల్పకశాఖా = కల్పవృక్షశాఖయొక్క, విభ్రమ = భ్రమను, దాయి = కల్గించునది, మృణాలలతాయిత = నాచుతీగవలెనున్న, సముజ్జ్వలతర = మిక్కిలిగా వెలుగొందు, కనకవలయవల్లీ = లతారూపములోని కనకవలయ ముచే, వేల్లిత = చుట్టబడిన, ఏకతరబాహుదండయుగళః = రెండు బాహుదండద్వయములో (క్రిందికి చాచిన) ఒక బాహుదండయుగళమును



కల్గినవాడు.

ఇందులో స్వామి చతుర్బాహువులలో క్రింది దిశలో విస్తరించిన రెండు బాహువులు వర్ణింపబడుతున్నాయి. ఈ రెండు భుజాలు జానుపర్యంతం విస్తరించాయి (ఒకటి కటిహస్తం, రెండవది అభయహస్తం). అవి ఆకారంలో, దార్ఢ్యంలో ఏనుగు తొండాలను మించినవి. ఇంతకుముందు స్వామి వేంకటాద్రి శిఖరశేఖరంలోని గొప్ప కల్పవక్షంగా "శిఖరిశేఖర మహాకల్పశాఖీ" అని రూపింపబడ్డాడు. దానికి అనుగుణంగా, ఇక్కడ స్వామిబాహువులు ఆ కల్పవృక్షశాఖలుగా ఉత్ప్రేక్షింపబడుతున్నాయి. మిక్కిలి విస్తరించిన ఈ కల్పశాఖలు నీలమణి మయాలు. ఇక, కల్పవృక్షాన్ని ఆశ్రయించుకొని కల్పలత ఉంటుంది కదా! అదేవిధంగా ఇక్కడ ఈ కల్పశాఖలను చుట్టుకొని ఉండే మృణాల లతల (నాచుతీగల) వలె గొప్పగా ప్రకాశిస్తున్న బంగారు వలయాలు పరివేష్ఠించి ఉన్నాయి. బాహువులను ఏనుగు తొండంతో పోల్చడం కవితాసంప్రదాయం. వర్తులత్వం, దృఢత్వం, ధైర్యం మొదలైనవి దీనివల్ల స్ఫురిస్తాయి.

**20.** యుగపదుదిత కోటిఖరకర హిమకర మండల జాజ్జ్వల్యమాన సుదర్శన పాంచజన్య సముత్తుంగిత శృంగాపరబాహుయుగళః,

యుగపత్+ఉదిత = ఒకే మారు ఉదయించిన, కోటి = కోట్లసంఖ్యలోని, ఖరకర = సూర్యులయొక్క, హిమకర = చంద్రులయొక్క, మండల = మండలముల వలె, జాజ్జ్వల్యమాన = మిక్కిలి ప్రకాశించు, సుదర్శన పాంచజన్య= సుదర్శన పాంచజన్యములను కల్గినవి, సముత్తుంగితశృంగ = మిక్కిలి ఉన్నతములుగా చేయబడిన పర్వతశిఖరములవంటి, అపర = వేఱొక, బాహుయుగళః = బాహుద్వంద్వమును కలవాడు.

ఇపుడు సుదర్శనపాంచజన్యాలను దాల్చిన వేఱొక బాహుయుగ్మం వర్ణింపబడుతున్నది.

"సుదర్శనం భాస్కరకోటితుల్యమ్" (కోటి సూర్యులతో సమానుడు

సుదర్శనుడు) అన్నట్లు కోటిసూర్యుల తేజస్సును కలవాడు శ్రీసుదర్శనుడు. తెల్లని చల్లని ప్రకాశాన్ని కల్గిన పాంచజన్యం కోటిచంద్రుల వెలుగును కల్గినది. ఈ రెండింటిని స్వామి ఉన్నతాలైన పర్వతశిఖరాల వలె భాసించే బాహువులలో ధరించి ఉన్నాడు. "ఖరకరు'' డంటే సూర్యుడు. "తిగ్మం తీక్ష్ణం ఖరమ్'' అని అమరం. "తిరుమాలురు వొక్కుమ్ మేరు, అమ్మేరు విల్ శెఙ్జుడరో తిరుమాల్ తిరుక్కై తిరుచ్చక్కర మొక్కుమ్'' (శ్రియఃపతిరూపం మేరుపర్వతంలో సాటి వస్తుంది. ఆ మేరు పర్వతంపై గల సూర్యునితో శ్రియఃపతి శ్రీకరంలోని సుదర్శనం సాటి వస్తుంది) నమ్మాళ్వార్ల అనే తిరువిరుత్తసూక్తి (88) శ్రీసుదర్శనానికి సూర్యునితో గల సామ్యాన్ని తెల్పుతుంది. అదేవిధంగా, గోదాదేవి అనుగ్రహించిన నాచ్చియార్ తిరుమొఴి ప్రబంధంలోని - "శన్దిరమణ్డలమ్ పోల్ దామోరన్ కైయిల్ అన్దర మొన్ఱిన్ఱి యేఱి'' (4) (చంద్రమండలంవలె దామోదరుని చేతిలో ఏ సంకోచం లేకుండా అధిరోహించి) అని, "తడవరైయిన్ మీదే శరఱ్కాల శన్దిరన్ ఇడైయువావిల్ వన్దు ఎళున్దాలేపోల్'' (3) మొదలైన సూక్తుల భావాలు పాంచజన్యానికి చంద్రునితో గల సామ్యాన్ని వ్యక్తం చేస్తున్నాయి. శంఖచక్రాలను సూర్యచంద్రులతో పోల్చినందులకు అనుగుణంగా బాహు వులను పర్వతశిఖరాలుగా ఉపమింపబడ్డాయి. "శరచ్చంద్రప్రతీకాశ పాంచజన్యధరమ్'' అని వరాహపురాణం (47వ అధ్యాయం)లో స్వామి ధరించిన శంఖం చంద్రునివంటిది అని వర్ణింపబడింది.

బ్రహ్మాదులు దర్శించిన శ్రీనివాసుని రూపంలోకూడా శంఖచక్రాలను దాల్చిన బాహుయుగ్మం, కటిహస్తం, అభయహస్తం ఉన్నట్లుగా - "తన్మధ్యస్థం దివ్యమూర్తిం వరేణ్యం శంఖం చక్రం ధారయంతం కరాభ్యామ్, సేవ్యత్వేన స్వం పదాంభోజ యుగ్మం సర్వేషాం సందర్శయంతం కరేణ, స్వాంఘ్రిద్వంద్వం సంశ్రితానాం జనానాం సంసారాబ్ధిః జానుదఘ్నః కిలేతి, న్యస్తేనోరౌ వామతో దర్శయంతం సవ్యేనాన్యేనాపి హస్తేన సమ్యక్'' అనే మార్కండేయపురాణం (2వ అధ్యాయం) లోని సూక్తి తెల్పుతున్నది. కుమారస్వామికి సాక్షాత్కరించిన రూపం కూడా ఇటువంటిదే అనే అంశాన్ని "శంఖం చక్రం ధారయంతం కరాభ్యాం ఫలప్రదర్శి ఊరుగ వామహస్తమ్, ప్రాప్యా విమౌ విత్యపరేణ పాదౌ సందర్శ



యంతం కరపంకజేన'' (రెండు చేతులతో శంఖ చక్రాలను ధరించినవాడు, వేరొక, తొడను తాకే, ఫలాన్ని ప్రదర్శించే ఎడమ చేతిని, నా ఈ పాదాలు ఆశ్రయించదగినవి అని చూపించే ఇంకొక చేతిని కల్గినవాడు) అనే మార్గండేయ పురాణం (4వ అధ్యాయం) లోని సూక్తి తెల్పుతున్నది. ఇదే విషయాన్ని భవిష్యోత్తరపురాణం 13వ అధ్యాయంలోని "దర్శయన్ పాణినైనైన దక్షిణేన వృషాకపిః, పద్మపద్మం సురారాధ్యం గతించ పరమాం నృణామ్, కటిన్యస్తకరేణాపి నిజపాదాబ్జగామినామ్, నృణాం భవ పయోరాశిం కటిదఘ్నం ప్రదర్శయన్'' (కుడిచేతితో దేవతలచే ఆరాధింపబడే తన పదపద్మాలను నరులకు గొప్ప గతిగా చూపిస్తూ ఉన్నవాడై, నడుముపై పెట్టుకొన్న వేఱొక చేతితో తన పాదాల వద్దకు వచ్చే మానవులకు సంసార సముద్రము మొలలోతు మాత్రమే అని తెలుపుతున్న వాడై) అనే సూక్తి స్పష్టీకరిస్తున్నది.

21. అభినవశాణ సముత్తేజిత మహామహానీలఖండ మదఖండననిపుణ నవీన పరితప్త కార్తస్వరకవచిత మహనీయ పృథులసాలగ్రామ పరంపరాగుంఫిత నాభిమండలపర్యంత లంబమానప్రాలంబదీప్తి సమాలంబిత విశాలవక్షఃస్థలః,

అభినవ = కొత్తదైన, శాణసముత్తేజిత = ఒరపిడి రాయిపై సాన పెట్టబడినదై, మహా=గొప్పదైన, మహానీలఖండ = మహానీలమను రత్నఖండముయొక్క, మదఖండన = గర్వమును ఖండించుటలో, నిపుణ = సమర్థమైనది, నవీన = కొత్తగా, పరితప్త = బాగుగా కాచి శుద్ధి చేయబడిన, కార్తస్వర = బంగారముతో, కవచిత = కవచముతో ఆవరింపబడిన, మహనీయ =గొప్పవైన, పృథుల = పెద్దవైన, సాలగ్రామ = సాలగ్రామశిలలయొక్క, పరంపరా = వరుసలచే, గుంఫిత= కూర్చబడినదై, నాభిమండలపర్యంత = నాభి మండలములవరకు, లంబమాన= వేలాడు, ప్రాలంబ = మాలికయొక్క, దీప్తి = కాంతిచే, సమాలంబిత = ఆలంబనముగా గొనబడిన, విశాల = విస్తృతమైన, వక్షఃస్థలః = వక్షఃస్థలమును కలవాడు.

ఇందులో స్వామి వక్షఃస్థలం, అందులో అలంకరింపబడ్డ సాలగ్రామమాల వర్ణింపబడుతున్నాయి.

భగవానుని నల్లగా మెటిసే వక్షఃస్థలాన్ని చూస్తే కొత్తదైన ఒరపిడిరాయిపై సాన పెట్టబడిన చాలా గొప్ప ఇంద్రనీలమణిఖండం గర్వాన్ని తీర్చేటట్లు భాసిస్తున్నది. ఆ వక్షస్థలంలో సాలగ్రామమాల అలంకరింపబడింది. ఆ మాలికలోని సాలగ్రామాలు నూతనంగా పుటం పెట్టబడిన బంగారు కవచాలను కల్గినవి. ఈ సాలగ్రామాలన్నీ గొప్పవి. ఈ సాలగ్రామమాల స్వామి నాభివరకు విస్తరించిఉన్నది. ఈ సాలగ్రామమాలికాశోభతో స్వామి వక్షస్సు ప్రకాశిస్తున్నది.

"ప్రాలంబ" శబ్దం "మాల" అనే అర్థాన్ని ఇస్తుంది. "ప్రాలంబముత్కృష్య యథావకాశం నినాయ సాచీకృత చారువక్త్రః" అని రఘువంశ (6-14) ప్రయోగం స్మరణీయం.

22. గంగాఝరతుంగాకృతిభంగావలిభంగావహసౌధావలిబాధావహ ధారానిభ హారావళిదూరాహత గేహాంతరమోహావహమహిమమసృణిత మహాతిమిరః,

గంగాఝర = గంగాప్రవాహముయొక్క, తుంగ = ఉన్నతమైన, ఆకృతి= ఆకారమును కల, భంగ+ఆవళి = కెఱటాల సమూహముయొక్క, భంగ+ఆవహ = భ్రమను కల్గించునవి, సౌధావళి = సౌధముల వరుసకు, బాధావహ = బాధను కల్గించునవి, ధారానిభ = జలపాతములవంటివి అగు, హారావళి = హారముల వరుసచే, దూర+ఆహత=దూరము తరిమి వేయబడిన, గేహ+అంతర= గర్భాలయములోని, మోహ = భ్రమను, ఆవహ = కల్గించు, మహిమ = ప్రభావమును కల, మసృణిత = చిక్కని, మహాతిమిరః = గొప్ప చీకటిని కలవాడు.

ఇందులో స్వామి ధరించిన ముక్తాహారాల శోభాతిశయం వర్ణితం.

స్వామి దాల్చిన ముత్యాలహారాలను చూస్తే అవి గంగానదియొక్క ఉత్తుంగ తరంగాలను మించి ఉన్నాయి. తెల్లని రంగును కల్గిన సౌధాల సమూహాన్ని మించి ఉన్నాయి. జలపాతాలవలె ఉన్నాయి. ఈ హారాల కాంతితో ఆలయగర్భగృహంలో వ్యాపించి భ్రమను కల్గించే దట్టమైన చీకటి సైతం తొలగిపోతున్నది.



23. పింగాకృతిభృంగారునిభాంగార దళాంగామల నిష్కాసిత దుష్కార్యఘ నిష్కావళి దీపప్రభ నీపచ్ఛవి తాపప్రద కనకమాలికా పిశంగితసర్వాంగః,

పింగ+ఆకృతి=ఎఱ్ఱని వర్ణమును కల్గిన, భృంగారునిభ= బంగారమువంటి, అంగారదళ = అగ్నికణములచే, అమల = శుద్ధమైనది, నిష్కాసిత = దూరము చేయబడిన (పారద్రోలబడిన), దుష్కారి+అఘ = పాపుల పాపములను కల్గినది, నిష్కావళి = బంగారు దీనారాలు, దీపప్రభ = దీపముల కాంతి, నీప = కడిమెపూలు- అను వీనియొక్క, ఛ్ఛవి = కాంతికి, తాపప్రద = తాపమును కల్గించునది (అనగా-వీటిని మించినది) అగు, కనకమాలికా = బంగారు మాలికచే, పిశంగిత = పింగవర్ణముతో కూడుకొనునట్లు చేయబడిన, సర్వ+అంగః = సమస్త అవయములను కలవాడు.

"నిష్కమస్త్రీ సాష్టౌహేమశతే దీనారకర్షయోః, వక్షో-లంకరణే హేమమాత్రే హేమఫలే-పి చ" అనుమేదినీ నిఘంటువునుబట్టి నిష్కశబ్దానికి ఇక్కడ బంగారు దీనారాలని అర్థం. "పిశంగ" వర్ణమంటే కపిలవర్ణం. నలుపు, ఎఱుపు, పసుపు వర్ణాల సమ్మేళనం వల్ల ఏర్పడే రంగు.

24. నవదళిత దళవలిత మృదులలిత కమలతతి మదవిహతి చతురతర పృథులతర సరసతర కనకసర మయరుచిర కంఠికా కమనీయకంఠః,

నవదళిత = కొత్తగా విచ్చుకొనిన, దళ = రేకులతో, వలిత = చుట్టబడియున్న, మృదుల = సుకుమారమైన, లలిత = అందమైన, కమల = కమలముల, తతి = సమూహముయొక్క, మద = గర్వము, విహతిచతురతర= పోగొట్టుటలో మిక్కిలి సమర్థమైన, పృథులతర=మిక్కిలి పెద్దది, సరసతర = మిక్కిలి సరసమైనది, కనకసరమయ = బంగారు సరములతో చేయబడినది అగు, రుచిర = అందమైన (ప్రకాశించు), కంఠికా = కంఠిక (కంటే) అను కంఠాభరణముచే, కమనీయ= అందమైన (ఆకర్షించు), కంఠః = కంఠమును కలవాడు.

స్వామి కంఠసీమను అలంకరిస్తున్న కంఠికాభరణం వర్ణింపబడుతున్నది. ఈ కంఠిక - అనే కంఠాభరణం బంగారుతో చేయబడిన తామరపూవులతో కూర్చబడింది. ఆ తామరపూల శోభ కొత్తగా విచ్చుకొన్న దళాలను కల,

సుకుమారమైన, అందమైన కమలాల అందంకంటే అతిశయించిన సౌకుమార్యాన్ని అందాన్ని, కల్గి ఉన్నది.

25. వాతాశనాధిపతిశయన కమనపరిచరణ రతిసమేతాఖిల ఫణధరతతి మతికర కనకమయనాగాభరణ పరివీతాఖిలాంగావగమిత శయనభూతాహిరాజ జాతాతిశయః,

వాతాశనాధిపతిశయన = ఆదిశేషుడనే పడుకలో, కమన = కోరికను కల స్వామియొక్క, పరిచరణ = సేవయందలి, రతి = ఆసక్తితో, సమేత = కూడియున్న, అఖిలఫణధరతతి = సమస్త సర్పసమూహమా ఇది! అను, మతికర = భావనను కల్గించునది, కనకమయ = బంగారముతో చేయబడినది అగు, నాగ+ఆభరణ= నాగాభరణములను అలంకారములచే, పరివీత = చుట్టబడిన, అఖిల+అంగ = సమస్తాంగములందు, అవగమిత = తెలిసికొనబడిన, శయనభూత = శయనముగా నున్న, అహిరాజ = ఆదిశేషుని వలన, జాత = కల్గిన, అతిశయః= అతిశయమును కలవాడు.

ఇక్కడ ఒకవిషయం ముఖ్యంగా అవధేయం. శ్రీవేంకటేశ్వరుని బాహు యుగ్మాలు నాగాభరణాలను కల్గి ఉన్నా, ఆ స్వామిలో దేవతాంతరతత్త్వాన్ని భావించే అవకాశం అణువు అంతకూడా లేదు. ఆకాశరాజు పద్మావతిని శ్రీనివాసునకు ఇచ్చి పాణిగ్రహణం జరిపిన సందర్భంలో వరుడైన శ్రీనివాసునకు పలు ఆభరణాలను సమర్పించాడు. వాటిలో నాగాభరణాలు కూడా ఉన్నాయి. శ్రీవేంకటాచలమాహాత్మ్యం - భవిష్యోత్తరపురాణాంతర్గతమైన ఏకాదశాధ్యాయం లోని "నాగభూషణ యుగ్మం చ బాహుపురాదికాం స్తథా'' (348వ శ్లోకం) అనే వచనం దీనిని స్పష్టం చేస్తున్నది. అదే రీతిలో భవిష్యోత్తర పురాణాంతర్గతమైన శ్రీవేంకటాచల మాహాత్మ్యం 80వ సర్గ ఉమామహేశ్వర సంవాదరూపమైనది. అందులో పరమేశ్వరుడు పార్వతికి వేంకటేశ్వర రహస్యాను భవాన్ని తెల్పుతూ, ఆమూర్తిని గూర్చి పలికేటప్పుడు - "ఇంద్రనీలమణిశ్యామ రమణీయాహిభూషణైః ....... అలంకృతమ్'' అని అనడం కూడా గమనించదగినది. బ్రహ్మాండ పురాణంలోని శ్రీవేంకటేశ సహస్ర నామాధ్యాయం లోని "భోగీశ కంకణః'' అరీ నామం కూడ గమనించదగినది. ఈ అంశాలను అన్నిటినీ



భగవద్రామానుజులు ప్రస్తావించి వివరించిన వైనాన్ని అనంతార్యులు శ్రీవేంకటాచలేతి హాసమాలలో తెల్పుతూ "ఇత్థం నాగభూషణస్యాపి భగవతి వచనసిద్ధత్వాత్ న అనేనాప్యస్య దేవతాంతరత్వసిద్ధిః'' (ఈవిధంగా భగవానునిలో నాగభూషణాలు ఉన్నాయని తెలుపబడినందువల్ల శ్రీవేంకటేశ్వరునకు దేవతాంతరత్వసిద్ధిప్రసక్తి లేనేలేదు) అని అన్నారు. కనుక వేంకటేశ్వరుడు శివకేశవరూపమని, వేంకటాద్రి శివకేశవక్షేత్రమనేవారి వాదాలు పసలేనివే కాగలవు. పేయాళ్వార్లు (మహాయోగి) తమ మూడవ తిరువన్దాది (మూన్ఱామ్ తిరువన్దాది) ప్రబంధంలోని "తాళ్ శడైయుమ్ నీళ్ ముడియుమ్'' అనే పాశురంలో శివకేశవ (శంకరనారాయణ) రూపాన్ని శివుడు నారాయణునకు ప్రకారభూతుడు - అని తెల్పడం కోసం భావించారు. ఈ విషయాన్ని సరిగా గ్రహించలేక, వేంకటేశ్వరుని రూపం శివకేశవాత్మకమని భావించి వాదించే వారుండవచ్చు. కాని, దీనికి కూడా శ్రీరామానుజులు తగిన సమాధానాన్ని ఇచ్చిన రీతిని వేంకటాలేతిహాసమాలలోని తృతీయస్తబకంలో గమనించవచ్చు. ఈనాడు వేంకటేశ్వరుని రూపం సౌమ్యరూపంగా, విష్ణుతత్త్వాత్మకంగా స్పష్టంగా భాసిస్తున్నది. అయినా, ఇప్పటికీ కొందరు వాస్తవాన్ని గుర్తించలేక, జీర్ణించుకోలేక, ఒప్పుకోలేక శ్రీవేంకటేశ్వరునిలో శివకేశవతత్త్వాన్ని ఆరోపించి పల్కుతూ వాదించడం చాలా శోచనీయం.

"వాతాశనాధిపతిశయనకమన'' అనే ప్రయోగానికి, వాతాశనాధిపతి శయన = ఆదిశేషుడనే శయనం విషయంలో, కమన = కాముకుడు - ఆదిశేషుని పట్ల మిక్కిలి ప్రేమను కలవాడనే అర్థాన్ని చెప్పి, ఆదిశేషుని విషయంలో భగవాను నకు ఉండే ఆదరాతిశయం దీనిద్వారా ద్యోతకమవుతున్నదని చెప్పవచ్చు.

ఆకాశరాజు సమర్పించిన నాగాభరణాలు రెండు కొంతకాలానికి దొంగి లింపబడ్డాయి. వీరసింహుడనే రాజు సేతుదర్శనార్థం ప్రయాణం చేస్తూ, మార్గ మధ్యంలో వేంకటాచలాన్ని దర్శించి, అచట వేంచేసి ఉండే స్వామికి తగినట్లు ఒక పెద్ద గోపురాన్ని కట్టాలని భావించాడు. గోపుర నిర్మాణం సగం వరకు పూర్తి అయిన సందర్భంలో ఒకనాటి రాత్రి అతనికి స్వప్నంలో గొప్ప సర్పం కన్పించి, "రాజా! ఈ పర్వతం నాకు శరీరం. నీవు కట్టే గోపురం నాకు శిరో

భారమే కాగలదు. దీనివల్ల నాకు చాలా బాధ కల్గుతున్నది'' అని అన్నది. పండితులతో తనకు వచ్చిన కలనుగూర్చి విచారించిన రాజు గోపురనిర్మాణాన్ని నిలిపివేసి, తాను చేసిన అపచారానికి పరిహారంగా శేషుని రూపంలో ఒక ఆభరణాన్ని నిర్మింపజేసి, భగవానుని ఆజ్ఞానుసారంగా శ్రీనివాసుని వైకుంఠహస్తానికి ధరింపజేశాడు. తరువాత కొంతకాలానికి శ్రీరామానుజులు శ్రీనివాసుని ఒకే చేతికి మాత్రమే నాగాభరణం అలంకరింపబడి ఉండడాన్ని చూచి, ఆకాశరాజు రెండు నాగాభరణాలు సమర్పించాడు కనుక, రెండవ చేతికి కూడా నాగాభరణం అలంకరింపబడడం తగినదని భావించి, ఇంకొక నాగాభరణాన్ని చేయించి సమర్పించారు.

పద్మపురాణాంతర్గత వేంకటేశ్వరమాహాత్మ్యంలోని ఇరవై ఆఱవ అధ్యాయంలో, శుకమహర్షి పద్మసరోవర తీరంలో తపస్సు చేయగా, అతనికి సాక్షాత్కరించిన శ్రీనివాసభగవానుడు కూడా "నాగైరభినవాకల్పైః.... అలంకృతాంగమహిమా'' అని అంటూ నాగాభరణుడనే విషయం తెలుపబడింది.

26. రవికోటీ పరిపాటీ ధరకోటీర వరాటీకితవాటీరసధాటీ ధరమణిగణ కిరణ విసరణ సతతవిధుత తిమిరమోహగర్భగేహః,

రవికోటీ = కోటిసూర్యుల, పరిపాటీధర = క్రమమును ధరించు (సామ్యమును కల), కోటీరవర = గొప్ప కిరీటములోని, ఆటీకిత = వ్యక్తం చేయబడిన, వాటీ = తమ స్థానాలలోని, రస = శోభన యొక్క, ధాటీ = గొప్పతనాన్ని, ధర = ధరించే, మణిగణకిరణ = మణుల సమూహముయొక్క కిరణముల, విసరణ = వ్యాప్తిచే, సతత = ఎల్లప్పుడు, విధుత = దూరముగా తఱుమబడిన, తిమిర మోహ = చీకట్లవలన కల్గు, మోహ(భ్రాంతిని కల్గిన, గర్భగేహః= గర్భగృహమును కలవాడు.

స్వామి ధరించిన గొప్ప కిరీటం కోటి సూర్యుల ప్రకాశాన్ని కల్గినది. ఆ కిరీటంలోని మణుల కాంతితో గొప్ప ధాటిని కల్గినది. ఆ మణులచే గర్భగృహంలోని చీకటి అంతా బయటకు తఱుమబడుతున్నది.



కిరీటాన్ని సూర్యునితో పోల్చడం కవిసమయం. దివ్యసూరుల అనుభవం కూడా అటువంటిదే "పొన్‌శుడర్ కున్ఱత్తు పూన్దణ్ ముడియఱ్కు'' (స్వర్ణమయమైన ప్రకాశించే పర్వతంవంటిది, పూలతో అలంకరింపబడినది, చల్లనిదైన కిరీటం కలవానికి) అనే తిరువాయ్‌మొழి సూక్తి, "మిక్క శెఞ్జుడర్ పరుదిశూడి'' (గొప్ప ఎఱ్ఱని కాంతిని కల సూర్యుని కిరీటంగా అలంకరించుకొని) అనే తిరు వాశిరియ ప్రబంధసూక్తి, దీనిని అనుసరిస్తూ "ఆధిరాజ్యమధికం భువనానామీశ! తే పి శునయన్ కిల మౌళిః, చూళికామణిసహస్రమరీచేః హస్తిభూషణ! భువత్యుద యాద్రిః'' (హస్తిగిరికి అలంకారమై ఉండే వరదరాజ స్వామీ! లోకాలకు అన్నిటికి ప్రభువు అయిన నీ స్వభావాన్ని మిక్కిలిగా వ్యక్తం చేసే నీ కిరీటం, తన శిఖర ప్రదేశంలో ఉండే రత్నమనే సూర్యునకు ఉదయపర్వతంగా ప్రకాశిస్తున్నది కదా!) అనే వరదరాజస్తవంలోని కూరేశుల సూక్తి మొదలైనవి స్మరణీయాలు.

"ఉద్యత్ప్రచండమార్తాండ ప్రతీకాశకిరీటకః'' (ఉదయిస్తున్న, గొప్పగా వెలిగే సూర్యునివంటి కిరీటాన్ని కలవాడు) అని పద్మ పురాణం (33వ అధ్యాయం) లో స్వామి ధరించిన కిరీటం వర్ణింపబడింది. నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొழి ప్రబంధంలో "విట్టిలఙ్గు కరుమ్ శుడర్ మలైయే తిరువుడమ్బు, విట్టిలఙ్గు మదియమ్‌శీర్ శఙ్గు శక్కరమ్ పరుది'' (గొప్పగా ప్రకాశించే నీలపర్వతంవంటిది స్వామి దివ్యదేహం గొప్పగా ప్రకాశించే అందమైన చంద్రునివంటిది పాంచజన్యం, సూర్యునివంటిది సుదర్శనం) (2-7-5) అనే సూక్తి ద్వారా భగవానుడు ఒక నల్లని పర్వతం కాగా, ఆ పర్వత శిఖరాలపై వెలిగే సూర్యునివంటివాడు సుదర్శనుడు, చంద్రుని వంటివాడు, పాంచజన్యశంఖం - అని తెలుపబడడం ప్రకృతసూక్తికి మూలమని చెప్పవచ్చు.

27. అపరిమిత వివిధభువనభరితాఖండ బ్రహ్మాండమండల పిచండిలః,

అపరిమిత = అంతు లేని, వివిధ = అనేకవిధాలైన, భువన = లోకాలతో, భరిత = నిండిన, అఖండ = సమస్త, బ్రహ్మాండమండల = బ్రహ్మాండ మండలాలను కల, పిచండిలః = పెద్ద ఉదరాన్ని కలవాడు.

'పిచండ' ఉదరవాచకం. గొప్ప ఉదరాన్ని కలవాడు పిచండిలుడు.

28. ఆర్యధుర్యానంతార్య పవిత్రఖనిత్రపాత పాత్రీకృత నిజచుబుకగ వ్రణకిణ విభూషణవహన సూచితశ్రిత జనవత్సలతాతిశయః,

ఆర్యధుర్య = ఆచార్యవర్యులగు, అనంతార్య = అనంతార్యులయొక్క, పవిత్ర= పవిత్రమైన, ఖనిత్ర = గడ్డపారయొక్క, పాత = దెబ్బకు, పాత్రీకృత= పాత్రముగా చేయబడిన, నిజచుబుకగత =తన గెడ్డమునందుగల, వ్రణకిణ= గాయము గుర్తును, విభూషణ = గొప్ప అలంకారముగా, వహన = కల్గి యుండుట ద్వారా, సూచిత = సూచింపబడిన, శ్రితజనవత్సలతాతి శయః = అతిశ యించిన వాత్సల్యగుణమును కలవాడు.

ఆచార్యశ్రేష్ఠుడైన అనంతార్యులు గడ్డపారతో కొట్టిన దెబ్బవల్ల కల్గిన గాయపు గుర్తును స్వామి ఈనాటికీ చుబుకంపై ధరించి ఉన్నాడు. ఈ విధంగా అతడు ఈ వృత్తాంతం ఆగుర్తును ఒక అలంకారంగా ధరించి ఉండడం వాత్సల్యానికి గుర్తు. ఈ సందర్భాన్ని సూచిస్తూ శ్రీనివాస గద్యప్రణేత అయిన పురిశై శ్రీరంగాచార్య స్వామివారు "ఉజ్జ్వల వేంకటనాథస్తోత్ర"మనే ఒక అద్భుత స్తుతిని రచించారు.

దివ్యదేశాలలోని అర్చామూర్తులలో కల్యాణగుణాలు అన్నీ పూర్ణంగా ఉన్నా ఒక్కొక్కమూర్తిలో ఒక్కొక్కగుణం విశేషంగా భాసిస్తున్నది అని దివ్యసూరుల హృదయం. ఈ క్రమంలో తిరుమలలోని వేంకటేశ్వరుని రూపంలో "నికరిల్ పుకழాయ్" (సాటిలేని వాత్సల్యగుణాన్ని కలవాడా) అనేరీతిలో కల్యాణ గుణాలన్నింటిలో గొప్ప గుణమైన వాత్సల్యగుణం గొప్పగా ప్రకాశిస్తున్నది. నమ్మాళ్వార్ల అభిప్రాయం. వాత్సల్యమంటే దోషాన్ని గుణంగా గ్రహించే స్వభావం. దీనిని వేంకటేశ్వరుడు, తన చుబుకంలో అనంతార్యులు విసరిన గడ్డపార దెబ్బవల్ల కల్గిన గాయపును గుర్తును ఈనాటికి ధరించడం ద్వారా వ్యక్తంచేస్తున్నాడు. ఈ గుర్తు వాత్సల్య గుణాతిశయానికి చిహ్నమని ప్రకృతంలో తాత్పర్యం.



29. మడ్డుడిండిమ డమరుఝర్ఝర కాహళీ పటహావళీ మృదుమర్దలాలి మృదంగ దుందుభి ఢక్కికాముఖ హృద్యవాద్యక మధుర మంగళ నాదమేదుర విసృమర సరసగాన రసరుచిర సంతతసంతన్యమాన నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవాది వివిధోత్సవ కృతానందః,

మడ్డు = మడ్డు అను, డిండిమ = డిండిమమను, డమరు = డమరుకమను, ఝర్ఝర =ఝర్జరమను, కాహళీ = కాహళి అను, పటహ = పటముల అను, ఆళీ = సమూహములచే, మృదు = సున్నితమైన, మర్దల = మద్దెలల, ఆవళీ = సమూహముచే, మృదంగ = డోలు, దుందుభి = దుందుభి, ఢక్కికా = ఢక్క, ముఖ = మొదలగు, హృద్య = హృదయావర్జకములగు, వాద్యక = వాద్యముల, మధుర = తీయని, మంగళనాద = మంగళవాద్యములచే, మేదుర = దట్టముగా, విసృమర = వ్యాపించు, సరసగాన = రసవంతమైన గానముల, రస = రసముచే, రుచిర = అందమైనవి, సంతత = ఎల్లప్పుడు, సంతన్యమాన = బాగుగా విస్తరింపబడుచున్న, నిత్యోత్సవ = ప్రతిదినము జరుగు ఉత్సవములు, పక్ష+ఉత్సవ = పక్షోత్సవములు, మాస+ఉత్సవ = ప్రతిమాసములో జరుగు ఉత్సవములు, సంవత్సర +ఉత్సవ = సంవత్సరోత్సవ ములు, ఆది = మొదలగు, వివిధ+ఉత్సవ = పలు ఉత్సవములచే, కృత+ఆనంద = ఆనందమును కలుగచేయబడినవాడు (భక్తులకు ఆనందమును కల్గించువాడు).

"వాద్యప్రభేదా డమరుమడ్డుడిండిమ ఝర్ఝరాః, మర్దలః పణవోఽన్యే చ" అని అంటూ అమరంలో పలు వాద్యవిశేషాలు పేర్కొనబడ్డాయి. 'డమడమ' శబ్దాన్ని వెలువరించే వాద్యం డమరుకం, 'మడ్' అనే శబ్దాన్ని చేసే వాద్యం మడ్డు. (గుమ్మెట) 'డిండి' అనే శబ్దాన్ని చేసే వాద్యం డిండిమం. (రాయడిగిడిగిళ్ళు) 'ఝర్ఝ' అనే శబ్దాన్ని వ్యక్తం చేసే వాద్యం ఝర్ఝరం. (క్రైమళ్ళు) మర్దలమంటే మద్దెల. కాహళి అంటే బాకా. పటహ మంటే తమ్మట. దుందుభి అంటే భేరి. ఢక్కిక అంటే ఢక్క. మృదంగ మర్దలాదులు మద్దెలలోని విభేదాలు.

30. శ్రీమదానందనిలయవిమానవాసః,

సంపత్సమృద్ధిని కల ఆనందనిలయమను విమానమును వాసముగా

